# ఆంధ్ర వచన భాగవతము

## దశమ స్కంధం

శ్రీహరి పాదపద్మములందు చిత్తమును నిలిపి, అన్న పానాదులు వర్జించి, ప్రాయోపవిష్టుడై ఉన్న పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రుల వారిని ఉద్దేశించి — మహాత్మా! సూర్యవంశపురాజుల చరిత్ర, చంద్రవంశపురాజుల చరిత్ర మీరు చెప్పగా విన్నాను. విశేషించి యదువంశ చరిత్ర మీ కృపవలన తెలుసుకొన్నాను. నా జన్మపావనమైంది. ఆ యదు వంశమున అవతరించిన శ్రీకృష్ణభగవానుడు నా పితామహులైన పాండవులకు అండగా ఉండి కౌరవసేనా వాహినులను తరింపచేశాడు. విశేషించి తల్లి గర్భంలో బ్రహ్మాస్త్ర పీడితుడనై యున్న నాకు ప్రాణదానం చేశాడు. ఆ కరుణామయుని గాథలు ఎన్ని విన్నా తనివితీరకుండా ఉన్నది. మునీంద్రా! చెప్పండి, ఇంకా చెప్పండి మహాత్మా! ఆ శ్రీకృష్ణుని లీలలు, ఆ అవతారపురుషుని మహిమలు సవిస్తరంగా వినిపించి నా జన్మసార్థకం చెయ్యండి, అని అడిగాడు.

అది విన్నవాడై శుకయోగీంద్రుడు — రాజర్షిసత్తమా! పరీక్షిన్మహారాజా! నీవు హరికథామృతం గ్రోలవలెనని ఉవ్విళ్ళూరుతున్నావు. విష్ణుకథ విన్నవాడూ, చెప్పినవాడూ, చెప్పమని అడిగినవాడూ — ఈ ముగ్గురూ తరిస్తారయ్యా. నీవు

క్రమంగా చెప్పాడు. శ్రీకృష్ణావతార చరిత్ర సవిస్తరంగా చెప్తాను వినవలసినది, అంటూ ఇట్లా చెప్పసాగాడు :

## శ్రీకృష్ణావతార చరిత్ర

పూర్వం దైత్యులు అనేకులు ఈ పుడమిని ఆక్రమించుకొన్నారు. మదోన్మత్తులై పెచ్చుమీరి విచ్చలవిడి విహరించసాగారు. అప్పుడు ఈ దుర్మార్గులను భరించలేక భూదేవత మిక్కిలి దుఃఖాక్రాంత అయింది. గోరూపం ధరించి సృష్టికర్త అయిన బ్రహ్మదేవుని చెంతకు వెళ్ళి మొఱపెట్టుకొన్నది. అంతట కమలాసనుడు భూదేవి ఆర్తారావం విన్నవాడై, ఇంద్రాది దేవతలను వెంటనిడికొని ఈశ్వర సహితుడై క్షీర సాగర తీరానికి వెళ్ళాడు. పాలసముద్ర మధ్యమున శేష పాన్పుపై పవళించియున్న ఆ శ్రీమన్నారాయణమూర్తిని వేద మంత్రాలతో ప్రస్తుతించాడు. అప్పుడు భగవంతుడు సంతుష్టాంతరంగుడై అశరీరవాక్కున బ్రహ్మకిట్లా చెప్పాడు : చతురాననా! సర్వం నేనెరుగుదును. భూభారాన్ని బాపేటందుకు అచిరకాలంలో నేను పుడమిపైన అవతరిస్తాను. యదువంశంలో వసుదేవుని ఇంట శ్రీకృష్ణుడుగా జన్మిస్తాను. నాకు అత్యంత ప్రియుడైన ఆదిశేషుడు నాకు అగ్రజుడుగా అవతరిస్తాడు. నన్ను సేవించేటందుకు దేవతలందరినీ తమ తమ అంశములతో యాదవకులాన జన్మించమని చెప్పు. దేవకన్యలందరినీ గోపికలగా పుట్టమను, జగత్తును మోహింపచేసే నా మాయ కూడా ఒకానొక కార్యార్థం పుడమిపై పుట్టగలదు.

అంతట బ్రహ్మదేవుడు యీ విషయం సాంగోపాంగంగా దేవతలకు ఎరుకపరిచాడు. భూదేవిని ఊరడించి తిరిగి తన లోకానికి వెళ్ళిపోయాడు.

ఇక, ఇక్కడ భూలోకంలో మధురానగరం అనే పట్టణాన్ని రాజధానిగా చేసుకొని యాదవ వీరుడైన శూరసేన మహారాజు పరిపాలిస్తున్నాడు. ఆయన కుమారుడి పేరు వసుదేవుడు. వసుదేవుడు ఉగ్రసేనుడి కుమార్తె, కంసుని చెల్లెలు అయిన దేవకీదేవిని వివాహమాడాడు. కూతురిని అత్తవారింటికి పంపుతూ ఉగ్రసేనుడు, అనేక రథాలు, గుర్రాలు, ఏనుగులు, ధన కనకవస్తువాహనాలు, దాసదాసీజనం అరణంగా ఇచ్చాడు. చెల్లెలిని దిగవిడిచి రావడానికి కంసుడు మహోత్సాహంతో పూనుకొన్నాడు. చెల్లెలు దేవకిని, బావ వసుదేవుని రథంపై కూర్చోబెట్టుకొని వారికి సంతోషం కలిగేటట్లు స్వయంగా రథం నడప ఉద్యుక్తుడైనాడు కంసుడు. రథం రయమున పోతున్నది. వెంట ధనకనక వస్తువాహనాదులు వస్తున్నవి. ఆ సమయంలో తేరు నడుపుతున్న కంసుని చూచి ఆకాశవాణి, ఓయీ కంసా! చెల్లెలిని చూచి మురిసిపోతున్నావు. ఈమెకు ఎనిమిదవ కాన్పున పుట్టబోయే బిడ్డడు నిన్ను సంహరిస్తాడు సుమా!, అని పలికింది. అది విని కంసుడు అదరిపడ్డాడు. వస్తుతః దుష్టుడైన అతడు వెంటనే క్రోధోద్రిక్తుడై, చెల్లెలిని చంప కత్తిదూశాడు. అది చూచిన వాడై వసుదేవుడు అడ్డువచ్చి, బావా! వివాహమైన నూతన వధూవరులము మేము - ఇంకా మధుపర్కాలైనా విప్పలేదే, ఇంతటి ఘోరకృత్యానికి పూనుకొని మాకు ఎడబాటు కలిగ

స్తావా? నీకు ఒకరు చెప్పవలసిన పనిలేదు. నీవు శూరుడవు. ఒక స్త్రీని — విశేషించి నీ తోడబుట్టిన దానిని చంపుట పాడి కాదయ్యా? అంటూ ఎన్నెన్నో తత్త్వోపదేశాలు చేశాడు. కాని కఠినాత్ముడైన కంసుని హృదయం కరుగలేదు. చెల్లెలిని కొప్పుపట్టి లాగి చంప ఉద్యుక్తుడైనాడు. అంతట వసుదేవుడు ఒక్క క్షణం ఆలోచించినవాడై నేర్పుతో, ఉగ్రసేన నందనా! ఆకాశవాణి పలుకులకు నీవు భయపడవలసిన పనిలేదు. ఈమె గర్భవాసాన జన్మించబోవు పుత్రులుకదా నిన్ను చంపునది! ఆ బిడ్డలందరినీ నీకు అప్పగిస్తాను. కావున నిరపరాధియైన ఈమెను వదిలిపెట్టు, అని ప్రార్థించాడు. అందుకు కంసుడు సంతసించి దేవకిని ప్రాణాలతో విడిచిపుచ్చాడు. దేవకీవసుదేవులు తమ స్వగృహం చేరుకున్నారు.

అనంతరం దేవకీదేవి ఎనిమిదిమంది కొమాళ్ళను, ఒక్క కొమార్తెను కన్నది. తొలిచూలు పుట్టిన బిడ్డను, వసుదేవుడు తాను అన్నప్రకారం సత్యం తప్పక కంసునికి అర్పించాడు. బావగారి సత్యసంధతకు, సాధువర్తనకు హర్షించినవాడై కంసుడు, నీ యెనిమిదవ కొమారుడుకదా నాకు మృత్యువు, వీడివల్ల నాకు ప్రమాదంలేదు, కనుక తీసుకెళ్ళవలసినది, అని తిరిగి పిల్లవాణ్ణి ఇచ్చివేశాడు. ఇట్లా ఉండగా ఒకనాడు త్రిలోకసంచారి, నారదమునీంద్రుడు కంసునివద్దకు చనుదెంచాడు. మాటల సందర్భమున, వసుదేవుడు మొదలుగాగల యాదవులు, దేవకీదేవి మొదలైన యాదవ వనితలు వ్రజంలో వసిస్తున్న నందాది గోపకులు, వారి భార్యలు, వారి వారి బంధువులు — వీరంతా దేవతాంశ సంభూతులు కాని

మానవులు కావు. నీవు రక్కసుడవు. నీవు, నీ అనుచరులైన దైత్యులు అనేకులు లోకాన్ని బాధిస్తున్నందువల్ల మిమ్మల్ని అందరిని సంహరించడానికి విష్ణుభగవానుడు దేవకికి పుత్రుడుగా అవతరించబోతున్నాడు, అని చెప్పి వెళ్ళాడు. అంతట కంసుడు కళవళ పడినవాడై దేవకీవసుదేవులను ఇనుప సంకెళ్ళతో కట్టి కారాగారమున బంధించాడు. నాటినుంచి చెల్లెలికి జన్మించిన కొమాళ్ళను ఒక్కొక్కరినే పట్టి వధిస్తూ వచ్చాడు. పూర్వ జన్మలో హరిచే మృతుడైన కాలనేమి అను రాక్షసుడే తానని తెలుసుకొన్నాడు. హరియెడల, హరి భక్తులయెడల బద్ధవైరం వహించాడు. యాదవులందరిపైన పగబూనాడు. తండ్రియైన ఉగ్రసేనుని రాజ్యభ్రష్టుణ్ణిచేసి సింహాసనం ఆక్ర మించాడు. జరాసంధుడు, లంబుడు, ప్రలంబుడు, చాణూ రుడు, తృణావర్తుడు, అఘాసురుడు, ముష్టికుడు, అరిష్టుడు, ద్వివిదుడు, ధేనుకుడు, బకుడు, బాణుడు, భౌముడు, మాగ ధుడు, మహాశనుడు, నరకుడు, కేశి, పూతన, ఆదిగాగల రక్కసులను తోడుచేసుకొన్నాడు. మంచి – చెడ్డలు అర యక, పాప – పుణ్య విచక్షణలేక యాదవులను హింసిస్తూ వచ్చాడు. భూమిపైగల సాధువులను బాధిస్తూ వచ్చాడు. అతడుపెట్టే హింసలకు తాళలేక యాదవులనేకులు మధురా నగరం వీడి ఇతర దేశాలకు వెళ్ళి తలదాచుకొన్నారు. కొందరు విధిలేక ప్రాణము లరచేత పెట్టుకొని అతనిని కొలుస్తూ అందే ఉండిపోయారు.

ఈ విధంగా కంసుడు దేవకి గర్భవాసాన పుట్టిన ఆరు గురు కొమాళ్ళను నిర్దాక్షిణ్యంగా సంహరించాడు. పిమ్మట

ఏడవ గర్భాన ఆదిశేషుడు ప్రవేశించాడు. శ్రీమన్నారాయణుడు తనను ఆశ్రయించిన యాదవులను కాపాడదలచినవాడై యోగమాయను పిలిచి,- సర్వమంగళా! నీవు తక్షణమే వ్రేపల్లెకు వెళ్ళు. వసుదేవుని భార్య రోహిణి కంసునికి భయపడి అక్కడ ఉన్నది. దేవకి గర్భంలో వెలుగొందుతున్న నా తేజస్సును వెంటనే రోహిణి గర్భాన చేర్చు. నేను నిజాంశమున దేవకి గర్భాన అవతరిస్తాను. ఈలోగా నీవు నందుని భార్య యశోద గర్భాన జన్మించవలసినది, అని ఆనతిచ్చాడు. వెంటనే యోగమాయ హరి ఆజ్ఞను తలదాల్చి ఆవిధంగా చేసింది. జనులకీవిషయం తెలియక దేవకికి గర్భస్రావం అయిందని విచారించారు. అంతట శ్రీమన్నారాయణుడు భూభారం పోగొట్టటందుకు నిజాంశమున దేవకి గర్భాన ప్రవేశించాడు. హరి తేజస్సును గర్భమున ధరించి దేవకీదేవి దేదీప్యమానంగా వెలుగొందసాగింది. నెలలు పైబడుతున్న కొలది ఆ దివ్య తేజస్సు కంసుని భవనమెల్ల నిండింది. ఇది కాంచి కంసుడు భయభ్రాంతుల చిక్కినవాడై - నన్ను సంహరింప శ్రీహరి ఈమె గర్భమున ప్రవేశించాడు. లేకపోతే ఇంతటి మహా తేజస్సు ఎక్కడ నుంచి వస్తుంది? ఇప్పుడు కర్తవ్యమేమిటి? స్త్రీవధ, అందులోనూ సోదరి - ఎట్లా సంహరించేది? పైగా భ్రూణహత్య! ఇంతటి మహాపాపానికి ఒడికట్టితే, ఆయుష్షు, యశస్సు, ఐశ్వర్యం — అన్నీ హరిస్తాయంటారే పెద్దలు, ఇప్పుడేం చెయ్యను? అంటూ ఎటూ పాలుపోక మనస్సులో మథనపడసాగాడు. తుదకు దేవకి ప్రసవించిన వెంటనే శిశు

వును తెలటార్చవలెనని నిశ్చయించినవాడై, సమయం కొరకు నిరీక్షిస్తూ ఉన్నాడు.

అంతట శ్రీమన్నారాయణుడు భూమిపై అవతరించనున్నాడని ఎరిగినవారై ఇంద్రాది దేవతలు, నారదాది మహా మునులు వెంటరాగా బ్రహ్మదేవుడు, శివుడు దేవకీవసుదేవుల చెంతకు విచ్చేశారు. ఆ పుణ్యవతి గర్భమునయున్న శ్రీహరిని పలువిధముల ప్రస్తుతించారు. పిమ్మట దేవకిని గాంచి – దేవీ! సాక్షాత్తు ఆ శ్రీమన్నారాయణుడు నీ గర్భమందున్నాడు. నీ పుత్రుడై అవతరించి భూభారాన్ని బాపనున్నాడు. యాదవులను కాపనున్నాడు. నీవు కంస భీతిమాని స్వస్థచిత్తవుకమ్ము, అని ఊరడించి తిరిగి తమ నెలవులకు వెళ్ళిపోయారు.

## శ్రీ కృష్ణ జననం

అంతట ఒకనాటి అర్ధరాత్రి – సమస్త గ్రహనక్షత్ర తారకలు సౌమ్యంగా వెలుగుతుండగా, రోహిణీనక్షత్రయుక్త శుభ లగ్నమున తూర్పున పూర్ణచంద్రు డుదయించినట్లు దేవకీదేవియందు శ్రీకృష్ణభగవానుడు జన్మించాడు. అప్పుడు సమస్త దిక్కులు దివ్య తేజస్సుతో ప్రకాశించాయి. నదులు నిర్మల జలపూరితములై మెల్ల మెల్లన ప్రవహించాయి. చల్లని, మెల్లని సుగంధ వాయువులు వీచాయి. ధాత్రి యావత్తు సమస్త మంగళములను ప్రసాదించింది. వసుధకు వసంతం వచ్చినట్లు పూలవనాలన్నీ పుష్పించి పరిమళాలు వెదజల్లాయి. సప్త సముద్రాలూ స్వచ్ఛమై, మెల్ల మెల్లన

పొంగి సంగీతం పాడాయి. సకల ప్రాణులూ ప్రసన్నత చెందాయి. సర్వమానవ హృదయాలూ సంతోషమందాయి. నింగి నిర్మలమై ప్రకాశించింది. దేవదుందుభులు మ్రోగాయి. మేఘాలు కలకల ధ్వనులతో గర్జించాయి. అమరులు విరుల వానలు కురిపించారు. సురలు, సిద్ధులు, చారణులు ముదముతో స్తుతించారు. అప్సరసలు, విద్యాధరులు ఆడారు. గంధర్వులు, కిన్నరులు పాడారు. కృష్ణవర్ణంతోను, చతుర్బాహువులతోను, శంఖ చక్ర గదాది ఆయుధాలతోను, కౌస్తుభ మణితోను, శ్రీవత్సలాంఛనంతోను, మణిమయ కిరీటం, మకరకుండలాలతోను, పీతాంబరంతోను, కమల లోచనములతోను, కంకణ కేయూరాది భూషణములతోను కూడుకొన్నవాడై దివ్య ప్రభలతో దేదీప్యమానంగా వెలుగుతున్నాడా శ్రీహరి. అట్టి కుమారుణ్ణి కాంచి వసుదేవుడు అబ్బురపాటు చెందాడు. మహదానందమున ఆయన మనస్సు పొంగింది. బ్రాహ్మణోత్తములకు పదివేల గోవులు మనస్సులోనే దానం ఇచ్చాడు. విశుద్ధ చిత్తుడై చేతులెత్తి ఆ శ్రీహరికి సాష్టాంగ ప్రణామము లాచరించి పలురీతుల ప్రస్తుతించాడు. అంతట దేవకీదేవి మహాపురుష లక్షణుడైన కుమారుని చూచింది. ఒక వంక కంసునిమాట తలచుకొని భీతిల్లింది. మరొక వంక మహావిష్ణువు పుత్రుడైనందుకు ముదమందింది. అనేక విధాల స్తోత్రం చేసింది. – విశ్వరూపా! నీవు నాకు పుత్రుడవైనావు. ఇంతకంటె ఏంకావాలి నాకు మహానుభావా! ఇక నీవే నాకు దిక్కు. మధుసూదనా! నా అన్న కంసుడు కడు దుర్మార్గుడు. నీవు జన్మించినట్లు

అతనికి తెలియకుండా వుండాలని కోరుకుంటున్నాను. నీ మూలంగా అతనికి నేను భయపడుతున్నాను. ఇక నీవే మాకు శరణ్యం, అని వేడుకొన్నది. అది విని సర్వేశ్వరుడు - అమ్మా! నీవు పూర్వజన్మలో స్వాయంభువ మన్వంతరమున పృశ్ని అను పరమ పతివ్రతవు. నీ భర్త వసుదేవుడు సుతపుడు అనే ప్రజాపతి. మీరిరువురూ పెద్దకాలం నన్నుగూర్చి ఘోర తపస్సు చేశారు. పన్నెండువేల దివ్యవర్షాలు మీ తపస్సు కొనసాగింది. నేను ప్రత్యక్షమై వరం కోరమన్నాను. మీరు మాయలో చిక్కి ముక్తిని అపేక్షించక నావంటి పుత్రుని ప్రసాదించమని అడిగారు. నాకు నేనై ఉన్నాను కాని, నావంటి వాడంటూ మరొకడు లేడు. అందువలన ఆ జన్మలో నేనే మీకు పృశ్నిగర్భుడు అను పేర పుత్రుడనై జన్మించాను. రెండవజన్మలో మీరు అదితి, కశ్యపులైనారు. అప్పుడు నేను మీకు వామనావతారుడనై జన్మించాను. ఇది మీకు మూడవజన్మ. మరల జన్మలో మీకు పుత్రుడనై పుట్టాను. పూర్వజన్మ స్మృతికొరకే యీ నా నిజరూపం చూపాను. కానిచో నన్ను తెలుసుకొనే జ్ఞానం మానవులకు కలుగదు. కనుక పుత్రభావంతోనే కాక, పరబ్రహ్మ భావంతో నన్ను ఎల్లప్పుడూ స్మరిస్తూ ఉండండి. మీకు ముక్తి కలుగుతుంది. మీరు కంసునకు భయపడుతున్నారు. కావున నన్ను వ్రేపల్లెకు తీసుకొనిపోయి అక్కడ యశోద చెంత పరుండ బెట్టండి. యశోదకు కుమార్తెగా జన్మించిన నా యోగ మాయను వైశంబను ఇక్కడికి చేర్చండి. ఇందుకు సర్వ సాధనాలు నేను సమకూరుస్తాను. మీ సంకెళ్ళు విడివడతాయి.

ద్వారాలన్నీ తెరచుకొ టాయి. కావలివాళ్ళు మిన్నుల్లను కనిపెట్టలేరు. యమునానది త్రోవ ఇస్తుంది అని పలికి తక్షణమే ఆ రూపం ఉపసంహారించి, తల్లిదండ్రులు చూస్తుండగనే మామూలు పిల్లవాడైనాడు.

వెంటనే వసుదేవుడు భగవదాదేశానుసారం కుమారుని తీసుకొన్నాడు. పురిటిల్లు అయిన చెఱసాలనుంచి బయలుదేరాడు. ఇంతలో అక్కడ వ్రేపల్లెలో నందగోపుని భార్య యశోదమ్మ నీళ్ళాడింది. ఆడపిల్ల పుట్టింది. ఇక్కడ హరి మాయవలన వసుదేవునకు సంకెళ్ళు విడివడినాయి. సమస్త ద్వారాలూ వాటంతటవి తెరచుకొన్నాయి. కావలివాళ్ళంతా మచ్చు చల్లినట్లు మైమరచి ఉన్నారు. నగరం యావత్తూ గాఢ సుషుప్తిలో తూగుతున్నది. ఆ విధంగా వసుదేవుడు శ్రీకృష్ణుని ఎత్తుకొని మెల్ల మెల్లన భవనాలన్నీ గడచి నగరం విడచి యమునా తీరానికి చేరుకొన్నాడు. జోరున వాన కురుస్తున్నందున పిల్లవాడు తడిసిపోకుండా పైన ఆదిశేషుడు పడగ విప్పి గొడుగుపట్టి వెంట రాసాగాడు. యమునానది ఉరవడితో, ఉరుకులు పెడుతున్నది. నురుగులు క్రక్కుతున్నది. అలల కల్లోలంతో ఎగసి పడుతున్నది. అంతటి భీభత్సంగా ఉన్న యమునానది శ్రీకృష్ణుని ఎత్తుకొని వసుదేవుడు రాగానే మున్ను శ్రీరామునికి సముద్రుడు త్రోవ ఇచ్చినట్లు రెండు పాయలై త్రోవ ఇచ్చింది. భగవత్సహాయంవల్ల వసుదేవుడు ఏ అపాయమూ లేక వ్రేపల్లెలో ప్రవేశించాడు. అక్కడ గోపాలకులంతా నిద్రిస్తుండగా తన కుమారుణ్ణి యశోదమ్మ ప్రక్కలో పరుండబెట్టాడు. ఆమె

కుమార్తెను ఎత్తుకొని తిరిగి మధురానగరం చేరి చెఱసాల ప్రవేశించాడు. ఆ పిల్లను దేవకి చెంత పడుకోబెట్టి ఎప్పటివలె కాళ్ళకూ చేతులకూ సంకెళ్ళు తగిలించుకొని ఏమీ ఎరుగనట్లున్నాడు. తిరిగి నగరిలో వాకిళ్ళన్నీ ఎప్పటివలె మూసుకొన్నాయి. అక్కడ యశోదమ్మ గాఢ నిద్రలో మైమరచి ఉన్నందున ప్రక్కలో పిల్లవాణ్ణి చూచి తనకు కుమారుడే పుట్టాడని తలచింది.

పిమ్మట చెఱసాలలో బిడ్డ ఏడ్పు విని కావలివాళ్ళు మేల్కొన్నారు. పరుగున వెళ్ళి కంసునితో దేవకి ప్రసవించినదని విన్నవించారు. ఆ వార్త విని కంసుడు తనకు మృత్యువైన మేనల్లుడు జన్మించాడని విహ్వలచిత్తుడై నాడు. వెంటనే పాన్పు దిగి తత్తరపాటుతో, పిల్లవానిని వధించవలెనని పురిటింటిలోనికి పరుగెత్తాడు. అప్పుడు దేవకి దీనవదనయై కంసునితో - అన్నా! నీకు మేనకోడలు పుట్టింది; మేనల్లుడు కాదు. ఈ ఆడపిల్లను చంపడం నీకు న్యాయంకాదు. ఇప్పటికే నా బిడ్డలందరినీ సంహరించావు. ఈ ఒక్క పిల్లనైనా నాకు దక్కనివ్వు అన్నయ్యా, నిన్ను అర్థిస్తున్నాను, అని పలు విధాల ప్రాధేయ పడినది. కాని దుష్టచిత్తుడైన కంసుడు చెల్లెలి ప్రార్థనలు సరకుచేయక, బలాత్కారంగా ఆమె చేతులలోని శిశువును ఒడిసి పట్టుకొన్నాడు. పసికందు అని లేశమైనా జాలితలచక, పిల్లను ఎత్తి నేలమీద విసరికొట్టాడు. అంతట ఆ శిశువు అంతర్థానమై. సమస్త ఆభరణాలతోను, ఆయుధాలతోను దివ్య ప్రభలు విరజిమ్మ మహా మాయ రూపంతో పై కెగసి అంతరిక్షంలో నిలుచున్నది. సకల

సురకోటి ప్రస్తుతిస్తూ ఉండగా కంసుని కాంచి — ఓరీ, మూఢుడా! వృథాగా నన్ను హించావు. వధించ సమకట్టావు. ఇందుకు పాపఫలం అనుభవిస్తావు. నిన్ను చంపేవాడు వేరొకచోట ఉన్నాడు. ఇంతకు మునుపే పుట్టి పెరుగుతున్నాడు సుమా!, అని పలికి అంతర్ధానమైంది. అప్పుడు కంసుడు పూర్వం ఆకాశవాణి పలికిన పలుకులు అనృతము లయ్యెనని అబ్బురపాటు చెందాడు. తత్క్షణమే దేవకీ వసుదేవులను బంధముక్తుల కావించాడు. తన కేదో ప్రమాదం వాటిల్లుతుందని తొందరపడి దేవకి బిడ్డలందరినీ వధించినందుకు మిగుల విచారించాడు. తన పాపానికి ప్రాయశ్చిత్తం లేదని పశ్చాత్తపించాడు. తన తప్పు సైరించమని దేవకీ వసుదేవులను ప్రార్థించాడు. దేవకీ వసుదేవులు ప్రసన్నులై, జరిగినదానికి వగవ పనిలేదని కంసుణ్ణి ఓదార్చారు. కంసుడు వారివద్ద సెలవు గైకొని నిజ మందిరానికి వెళ్ళిపోయాడు.

ఆరాత్రి గడచింది. మరునాడు తనకు ఆప్తులైన మంత్రులను రావించి జరిగిన విషయమంతా ఎరింగించాడు కంసుడు. యోగమాయ పలికిన పలుకులు తెలియచెప్పి వారిని కర్తవ్యం అడిగాడు. వారు దుష్టచిత్తులు, దైత్యాంశ సంభూతులు కావున అతనికి దుస్సలహాలు ఇచ్చారు. పట్టణాలలోను, పల్లెలలోను గల పసిబాలురందరినీ – వీరూ వారూ అనక పురిటిండ్లలో బిడ్డలను సయితం పట్టి వధించవలె నన్నారు – మనకు దేవతలు బద్ధవిరోధులు. ఇంతకుమునుపే నీవు వారిని సమూలంగా వధించక విడిచిపుచ్చావు. మన శౌర్యం ముందు హరి హరబ్రహ్మాదులనగా ఎంత? దేవత

లంటపా విష్ణువును ఆశ్రయించి ఉన్నారు. ఆ విష్ణువు ధర్మ ము:ను ఆశ్రయించి ఉన్నాడు. ఆ ధర్మము వేదాలను, గోవు లను, బ్రాహ్మణులను, తాపసులను, యజ్ఞయాగాది క్రతువు లను ఆశ్రయించి ఉన్నవి. కనుక వీటిని మనం ధ్వంసం చేస్తే విష్ణువు, అతనితో పాటు మన విరోధులయిన దేవతలు నాశన మవుతారు. లేకపోతే ఆ విష్ణుమూర్తిని కనుగొనడం మన తరంకాదు. తక్షణం మాకు ఆజ్ఞ ఇవ్వండి. పసిబాలుర పట్టి వధిస్తాము, గోబ్రాహ్మణులను హింసిస్తాము. యజ్ఞయాగాది కర్మలను ధ్వంసం చేస్తాము, అని చెప్పారు. కంసుడు కాలపాశ మున చిక్కి, వివేకరహితుడై వల్లె అన్నాడు. బాలవధ, గోబ్రాహ్మణవధ చేయు కామరూపధారులు, కదనమందు ఆసక్తి కలవారు అయిన దైత్యులకు ఆజ్ఞ ఇచ్చి నలుదిశలకూ పంపాడు. వారు చెలరేగి భూమండలమంతా చుట్టబెట్టి కను పించిన సాధువునల్లా వధిస్తూ, యజ్ఞయాగాది కర్మలను ధ్వంసం చేస్తూ, గోబ్రాహ్మణ తాపసుల హింసిస్తూ విచ్చల విడి విహరించసాగారు.

ఇక్కడ ఇట్లా ఉండగా అక్కడ వ్రేపల్లెలో నంద గోపుడు తనకు పుత్రుడు పుట్టాడని పరమానంద భరితుడై నాడు. భూసురోత్తముల రప్పించి పుణ్యాహవాచనం చేయించి కుమారునికి జాతకర్మ నెరవేర్చాడు. తన పెద్దలను, పితృదేవ తలను, పూజించాడు. రెండు లక్షల పాడియావులను, కనక మణివసన విశాలములైన ఏడు తిల పర్వతాలను బ్రాహ్మణు లకు దానం ఇచ్చాడు. పిమ్మట వ్రేపల్లె వాడవాడలా మంగళ తోరణాలు కట్టి అలంకరింపచేశాడు. భేరీమృదంగాది వాద్య

ములు మ్రోగాయి. నర్తకులు ఆడారు. గాయకులు పాడారు. వందిమాగధులు ప్రస్తుతించారు. ఎక్కడ చూచినా పచ్చని పందిళ్ళు, రత్నాల రంగవల్లులు తీర్చిన ముంగిళ్ళు - వ్రేపల్లె అంతా వైకుంఠంలా వెలుగొందింది. ఈ విధంగా నందగోపుడు శ్రీకృష్ణ జన్మమున అత్యంత వైభవోపేతంగా జాతకోత్సవం జరిపించాడు. సమస్త గోపాలకులు, గోపికలు దివ్యాంబర భూషణాదులు ధరించి మహోల్లాసంతో ఉత్సవమున పాల్గొన్నారు. శ్రీకృష్ణుడు అవతరించడంతో గోకులానికి క్రొత్త వెలుగు వచ్చింది. అంతటా దివ్యతేజస్సు ప్రకాశించింది. పశుపక్ష్యామృగాది సకల ప్రాణులూ క్రొత్తజీవం పోసుకొన్నాయి. ధాత్రియావత్తూ రాగరంజితమైంది. సర్వత్రా లక్ష్మి ఓలలాడింది. ఉత్సవం పూర్తి అయిన పిదప నందుడు గోకులానికి గోపాలకులను కావలి ఉంచి తాను ఏటేట కంసునకు చెల్లించవలసిన కప్పమును గైకొని మధురానగరం వెళ్ళాడు. కంసునికి కప్పం కట్టి అతని అనుమతి బడసి తిరిగి బయలుదేరే ముందు వసుదేవుని చూడవలెనని అక్కడ ఒక పూట ఆగాడు. వసుదేవుడు తన ఆప్తమిత్రుడు. బంధువు అయిన నందుని ఆనందాశ్రువులురాల ఆలింగనం చేసుకుని తోడితెచ్చి కుశలప్రశ్నలడిగి సకల మర్యాదలు చేశాడు. నందుడు వసుదేవుని యోగక్షేమములడిగి, ఆయన పుత్రులందరినీ దుష్టుడైన కంసుడు వధించినందుకు మిగుల విచారించాడు. తన కుమారుడు నందుని ఇంటనైనా క్షేమంగా పెరుగుతున్నందుకు వసుదేవుడు మనస్సులో సంతసించి, దైవమాయ ఎరిగినవాడు కావున, వ్రేపల్లెలో ముప్పు రానున్నదని శంకించి బాగు

చేయక వెంటనే తిరిగి గోకులానికి వెళ్ళమని సంమసి హెచ్చ
రించాడు. అంతట నందుడు వసుదేవుని వాక్కు వృథాకాదని
వ్యాకులంతో దుశ్శకునాల కాంచుతూ త్వరత్వరగా వ్రేపల్లెకు
ప్రయాణమైనాడు.

## పూతనవధ

ఇట్లా ఉండగా అక్కడ పూతన అనే రక్కసి; బాల
ఘాతిని; కంసుని పంపున బయలుదేరి పట్టణాలు; పల్లెలు అన్నీ
చుట్టిబెట్టుతున్నది. కామరూపమున మాయాలు స్త్రీగావచ్చి
కనుపించిన బాలకులందరినీ పట్టి మాయోపాయముల సంహ
రిస్తున్నది. చివరకొకనాడు శ్రీకృష్ణుడున్న వ్రేపల్లెలో ప్రవే
శించింది. కామరూపమున ఒక చక్కని సుందరివేషం ధరించి
మేలైన చీరకట్టి కొప్పులో పువ్వులు తురిమి; వివిధ మాయో
పాయముల ఇల్లిల్లూ తిరిగి పిల్లలకోసం గాలిస్తున్నది. నందుని
ఇంట బాలరోదనం విని; మెల్లమెల్లన లోన ప్రవేశించింది.
అక్కడ దివ్యతేజస్సుతో ప్రకాశిస్తున్న చిన్ని కృష్ణుణ్ణి
చూచింది. యశోద; రోహిణి; తక్కిన గోపికలు ఆమె తేనె
పూసిన కత్తి అనీ; పయోముఖ విషకుంభమనీ తెలుసుకో
లేకపోయారు. అతిమోహన రూపంతో; బాలెంతవలె
కనపడుతున్న ఆ సుందరాంగిని ఏమీ అనక చూస్తూ
నిలుచుండిపోయారు. పూతన తన మాయా ప్రయుక్తితో
ఆ మాటా – ఈ మాటా చెపుతూ చిన్నికృష్ణుని ముద్దాడు
తున్నట్లు నటించింది. తుదకు పిల్లవానిని ఎత్తుకొని తొడపై
కూర్చో బెట్టుకొన్నది. మాయామానుష విగ్రహుడు,

సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు, అయిన ఆ శ్రీహరి రాకసి ఆడే కపట నాటకం ఎరిగియు, ఏమీ ఎరుగని సామాన్య బాలకునివలె కన్నులు మూసి ఊరకున్నాడు. యశోద కాని రోహిణికాని ఆమెను వారించలేదు. అప్పు ఆ పూతన భ్రమించి మృత్యువును ముద్దాడినట్లు బాలకృష్ణుని ముద్దాడి తొడపై నిడుకొని పాలివ్వ పూనుకొన్నది. ఆమె కాలకూట విషభరితమైన తన చన్ను కుడుప ఆ చిన్ని కృష్ణుడు చిరు నవ్వులు చిందు ఆవు రావున రక్కసి చన్నులు గట్టిగా పట్టి దాని పంచ ప్రాణాలను పీల్చాడు. చిన్ని కృష్ణు డట్లా గుక్క పట్టి పీల్చేటప్పటికి ఆ రక్కసి సమస్త మర్మస్థానాలు నొచ్చి నవి: అది ఓర్చుకోలేక - ఇక చాలు విడువు; విడువుమని పెద్ద పెట్టున అరచింది. దాని ఒడలు చెమర్చింది. కనులు గిరగిర తిరిగాయి. అది విల విల తన్నుకొనుచు పెద్ద పెట్టున కేకపెట్టి నేల కూలింది. దాని అరపుకు ధరణి వణకింది. కొండలు ఘూర్ణిల్లాయి. దిక్కులు ప్రతిధ్వనించాయి. గ్రహతారకలు చలించాయి. సమస్తలోకాలు భీతిల్లాయి. జనులు పిడుగు పడ్డట్లు భయవిచలితులై ఎక్కడి వారక్కడ పుడమిపై వ్రాలారు. ఆ విధంగా ఆ రక్కసి అసువులు బాసి మాయా రూపం విడచి; నిజరూపమున ఘోరపర్వతాకారంతో పుడ మిపై కూలేటప్పటికి; ఆ చుట్టుప్రక్కల ఆరుక్రోసుల దూరంలో ఉన్న చెట్లు - చేమలు నుగ్గు - నుగ్గు అయినాయి. ఏనుగు కోరలవంటి కోరలు, పర్వతగుహలవలెనున్న ముక్కులు, గండశైలములబోలు చన్నులు, పాడుపడిన బావులవలెనున్న కన్నులు, పెద్ద పిఱుదులు, చెఱువులా ఉన్న కడుపు, దీర్ఘ

కేశములు,- ఇటువంటి ఘోర రౌద్రాకారమైన దాని కళే
బరం చూచి గోపకులు, గోపికలు భయవిహ్వలులై పరుగు
తీశారు. కాని చిన్ని కృష్ణుడు మాత్రం బెదరక, చెదరక దాని
కళేబరంమీద ఆటలాడుకొంటున్నాడు. తరువాత యశోద, రోహిణి
తదితర గోపకాంతలు చిన్ని కృష్ణుని దగ్గరకు వెళ్ళారు.
నాయనా భయపడ్డావా? ఎక్కడైనా దెబ్బ తగిలిందా?
ఎట్లా ఉన్నావురా చిట్టి తండ్రీ? నీవేమైపోయావో అని మా
ప్రాణాలు తల్లడిల్లాయిరా, అంటూ వారు కృష్ణుణ్ణి ఊరడించి,
ఒడలంతా తడిమి చూచి ముద్దాడి ఇంటికి తీసుకెళ్ళారు. పిల్ల
వాడు జడుసుకున్నాడని రాజవైద్యులను భూతవైద్యులను
రప్పించారు. రక్షరేకులు కట్టించారు. మంత్రించి విభూతి
పెట్టించారు. దృష్టి తీయించారు. దీర్ఘాయుష్కుడవు కమ్మని
దీవెనలిచ్చారు. ఇట్లా పలువిధాలైన ఉపచారాలు చేసిన పిదప
యశోదమ్మ, కృష్ణుని పక్కలో పడుకోబెట్టుకొని పాలిచ్చి
జోలపాడి నిద్రపుచ్చింది.

అంతట నందుడు మధురానగరంనుండి వచ్చి రక్కసి
కళేబరం చూచి వెఱగుపడ్డాడు. వసుదేవుడు చెప్పినది నిజ
మయ్యెనని ఆయనను కీర్తించాడు. ఇంటికి వెళ్ళి జరిగిన విష
యమంతా తెలుసుకొన్నాడు. హర్షమున మేను పులకింప
కుమారుని ఎత్తుకొని ముద్దాడాడు. పిమ్మట గోపకులు పూతన
కళేబరాన్ని గొడ్డళ్ళతో ఖండఖండాలుగా నరికి దహన సం
స్కారం కావించారు. ఆవిధంగా అతిదుష్టురాలైన రక్కసి
శ్రీహరికి పాలు కుడుపుటవలన పావనమై సద్గతిని పొందింది.
శ్రీకృష్ణుని బాల్యవిలాసమైన ఈ పూతనవధ ఏ మానవుడు

శ్రద్ధతో వింటాడో అతను ముక్తిని పొందుతున్నాడు. అతనికి గోవిందునిపై భక్తి సిద్ధిస్తున్నది - అని శుకయోగీంద్రుడు చెప్పగా పరీక్షిన్మహారాజు విన్నవాడై, హర్షమున మేను చెమర్చ - మహాత్మా! మాయామానుష వేషధారి అయిన ఆ శ్రీకృష్ణుని బాల్యక్రీడలు విన వేడుక పుడుతున్నది. ఇంకా చెప్పవలసినది, అని అడిగాడు. శుకయోగీంద్రుల వారు తిరిగి ఇట్లా చెప్ప నారంభించాడు.

## శకటాసుర వధ

శ్రీకృష్ణునికి బోర్లపడే యీడు వచ్చింది. పిల్లవాడి జన్మనక్షత్రంతో కూడిన ఒకనాడు యశోదమ్మ వేడుక చెయ్యాలనుకొన్నది. మేళతాళాలతో కృష్ణునికి మంగళ స్నానం చేయించి నూతన వస్త్రాభరణాలతో అలంకరించింది. భూసురోత్తములను రావించి స్వస్తి వాచకాలు చదివించి, వారికి అమూల్యవస్త్రాలు భూరిదక్షిణలు సమర్పించింది. గోదానము లిచ్చింది. పెద్దలను, పేరంటాళ్ళను పిలిచి అతి వైభవంగా విందులు, వేడుకలు చేసింది. కృష్ణుని ఉయ్యాల తొట్టిలో పరుండబెట్టి, జోలపాడి నిద్రపుచ్చిన పిదప యశోదమ్మ వచ్చిన పేరాంటాళ్ళకు, చుట్ట పక్కాలకు మర్యాదలు చేస్తూ ఉన్నది. కాని చిన్న కృష్ణుడు నిద్రపోయినట్లే నటించి, అంతలోనే కన్ను తెరిచాడు, కాళ్ళు చేతులు తన్నుకొంటూ పాలకోసం ఏడ్వడం మొదలుపెట్టాడు. చుట్ట పక్కాలకు మర్యాదలు చేయడంలో నిమగ్నురాలై ఉన్న యశోదమ్మ ఈ విషయం గమనించ లేదు. అప్పుడు కంసుని పంపున రాక్ష

సుడు ఒకడు శకటాకారంతో వచ్చి కృష్ణుని చంప ఉయ్యాల తొట్టిపై వ్రాలాడు. అంతట ఆ మాయ కృష్ణుడు సర్వమూ ఎరిగి, కాళ్ళు ఆడిస్తున్నట్లే ఆడిస్తూ శకటాసురుణ్ణి ఒక్క తన్ను తన్నాడు. శకటాసురుడు - బండిచక్రము, ఆకులు, ఇరుసు అన్నీ గిర్రున తిరుగ, ఎక్కడి కక్కడ విరిగి ఉయ్యాలకు ఇవతల దూరంగా వచ్చి నేలకూలాడు. అది చూచి యశోదమ్మ వేడుక చూడవచ్చిన ఇతర గోపికలు, నందుడు మొదలయిన గోపకులు అందరూ ఆశ్చర్య చకితులైనారు. ఆబండి అక్కడికి ఎట్లా వచ్చినదీ, ఎట్లా విరిగి కూలిపోయినదీ ఎవరికీ అర్థం కాలేదు. అంతట అక్కడ ఆడుకొంటున్న పిల్లలు,- తొట్టిలో కృష్ణుడు గుక్కపట్టి ఏడుస్తూ కాళ్ళతో చిమ్మగా ఆబండి విరిగి నేలకూలినదని తెలిపారు. కాని మాయకృష్ణుని మహిమ ఎరుగక వారంతా దీనిని నమ్మలేదు. ఇది సంభవమా, అనుకొన్నారు. పిల్లవాడికి ఏదో గాలిసోకిందో, గ్రహం సోకిందో అని భావించి వెంటనే బ్రాహ్మణుల పిలిపించి మంత్రాలు చదివించారు. భూతవైద్యుల రప్పించి విభూతులు పెట్టించి, రక్షరేకులు కట్టించారు. పిదప కృష్ణునికి పాలిచ్చి పరుండబెట్టింది యశోదమ్మ.

## తృణావర్త వధ

అంతట ఒకనాడు యశోద తన కుమారుని అంకమున చేర్చుకొని ముద్దులాడుతూ కూర్చున్నది. ఉన్నట్లుండి పిల్లవాడు కొండవలె అమితభారంగా తోచాడు. అప్పుడామె కృష్ణుని దించి నేలపై కూర్చోబెట్టింది. ఆ భగవంతుని మహి

పలు మనస్సులో తలపోస్తూ తన గృహకృత్యములలో నిమగ్న రాలైంది. ఆ సమయంలో కంసుని భృత్యుడైన తృణావర్తుడనే రక్కసుడు కామరూపంతో సుడిగాలి అయి వచ్చాడు. వాడు రావడంతో గోకులం అంతటా పెనుధూళి రేగింది. భూమి, ఆకాశం నిండింది. అంతటా చీకట్లు క్రమ్ముకొన్నాయి. ఒక్క క్షణంసేపు ఆ దుమ్మువలన ఎవరికీ కళ్ళు కనిపించలేదు. ఒకరి జాడ ఒకరికి తెలియలేదు. సుడిగాలి అయి వచ్చిన రక్కసుడు ఆ క్షణంలో బ్రహ్మాండమైన శబ్దంతో వీచి కృష్ణుణ్ణి ఎత్తుకొనిపోయాడు. పిమ్మట కొంతసేపటికి గాలివిసురు తగ్గింది. యశోదవచ్చి చూడగా తాను కూర్చోబెట్టినచోట కుమారుడు కనుపించలేదు. వెంటనే దుఃఖము పొంగిరాగా, ఆమె నేలమీదపడి పొర్లుతూ దూడను ఎడబాసిన ధేనువువలె బిగ్గరగా ఏడ్వసాగింది. ఆ ఏడ్పు విని గోపాలకులు, గోపికలు వచ్చి గుమికూడారు. జరిగిన విషయం తెలుసుకొని కృష్ణుని కోసం నలువైపులా వెదకారు. కాని ఎక్కడా కనుపించక పోయేటప్పటి అందరూ కన్నీళ్ళు కాల్వలుకట్ట విలపించసాగారు. అప్పుడు కృష్ణుణ్ణి ఎత్తుకొనిపోయిన తృణావర్తుడు మింటికెగసాడు. కాని అంతకంతకూ పిల్లవాడు భారమైనాడు. తుదకు తాను మోయలేక క్రింద విడువవలెనని విశ్వప్రయత్నం చేశాడు. కాని కృష్ణుడు ఆ రక్కసుని మెడ గట్టిగా పట్టుకొని ఎంతకు వదలడాయెను. తాను ఆపట్టు విడిపించుకోలేక, ఆ బరువు మోయలేక, ఆ బాధకు తాళజాలక తృణావర్తుడు కొండలు పగిలేటట్లు కేకలు పెట్టాడు. వాడి గ్రుడ్లు ఇంతింతలై బయటికి వెళ్ళవొచ్చాయి. వాడట్లా అరచి అరచి ప్రాణాలు

కోల్పోయి, ఒక మహావృక్షం విరిగి పడినట్లు నేలకూలాడు. గోపికలు, గోపాలకులు భయభ్రాంతులై పరుగున వెళ్ళి చూచారు. మహాపర్వతంలా పడి ఉన్న రక్కసుని రొమ్ము మీద చిన్ని కృష్ణుడు చెక్కుచెదరకుండా చిరునవ్వులు చిందిస్తూ కనుపించాడు. అందరి హృదయాలూ ఆశ్చర్యంతోను, ఆనందంతోను ఊగిపోయాయి. బాలుడు సాక్షాత్తు భగవంతుడని వారంతా భావించారు.

అటుపిమ్మట ఒకనాడు యశోద కృష్ణుడికి పాలిచ్చి, ఆడిస్తూ ముద్దులాడుతూ ఒడిలో కూర్చోబెట్టుకున్నది. అప్పుడు కృష్ణుడు ఆవులించగా నోటిలో భూమి, ఆకాశం, నక్షత్రాలు, సూర్యచంద్రులు, నాలుగు దిక్కులు, అగ్ని, వాయువు, సప్తసముద్రాలు, సకల ద్వీపాలు, గిరులు. తరులు,- జగత్తులోని చరాచర భూతజాలమంతా యశోదమ్మకు హఠాత్తుగా కనుపించింది. ఆమె దిగ్భ్రాంతి చెంది వెంటనే కనులు మూసుకుని ఆ శ్రీహరిని ధ్యానించింది.

ఆ తరువాత ఒకరోజున వసుదేవుడు పంపగా, యాదవ పురోహితుడైన గర్గుడు నందుని గృహానికి విచ్చేశాడు. ఆ మహాత్ముడు రాగానే నందుడు ఆయనను సగౌరవంగా తోడి తెచ్చి. ఉచితాసనంపై కూర్చుండబెట్టి అతిథి సత్కారాలు జరిపించాడు. పిమ్మట తన కుమారులైన రామకృష్ణులను ఆయనకు చూపించి వారికి పేర్లు పెట్టవలసినదిగా అర్థించాడు. జనులందరికీ ప్రీతికరంగా ఉండడం వలన బలరాముడికి రాముడనీ, అందరినీ ఆకర్షించే దివ్యశక్తి కలిగి ఉండడం వలన

శ్రీకృష్ణునికి కృష్ణుడనీ గర్గుడు నామకరణం చేశాడు. శ్రీకృష్ణునిద్వారా దుష్టశిక్షణ, శిష్టరక్షణ జరుగుతుందనీ, ఆయన నారాయణాంశ సంభూతుడనీ నందునికి ఎరుకచేసి అంతట ఆ మునీశ్వరుడు సెలవు తీసుకొని వెళ్ళాడు.

## శ్రీకృష్ణుని బాలక్రీడలు

జంటకుమారులు రామకృష్ణు లిద్దరూ ఎంతో ముచ్చటగా పెరుగుతూ వచ్చారు. అందులో ముఖ్యంగా శ్రీకృష్ణుని అల్లరి అంత - ఇంత అని చెప్పశక్యం కాదు. వారికెప్పుడికీ ఏ ఆపద వాటిల్లకుండా తల్లిదండ్రులు సంరక్షిస్తూ వచ్చారు. శ్రీకృష్ణుడు ఎంత అల్లరి చేసినప్పటికీ తల్లిదగ్గరికి వచ్చేసరికి మాత్రం ఏమీ ఎరుగని అమాయకునివలె నటిస్తూ వచ్చేవాడు. కాని అతని అల్లరి చేష్టలు మాత్రం గోప గోపీజనానికి కోపం తెప్పించేవి. వాటితో వారు వేగలేకపోయేవారు. ఒకనాడు గోపికలంతా కూడబలుకుకొని శ్రీకృష్ణుని తల్లి అయిన యశోదమ్మ చెంతకు వచ్చి అమ్మా! యశోదమ్మా! మీ అబ్బాయి కృష్ణయ్య చేస్తున్న అల్లరి పనులు ఇంత - అంత అని చెప్పడానికి వీల్లేదమ్మా! బాలింతరాండ్రు తమ బిడ్డలకు పాలు లేవని ఒకప్రక్క మొరపెడుతూ ఉంటే, ఈ అబ్బాయి సక్కన నవ్వి ఆవులకు దూడలను వదలిపెడుతున్నాడు. ఇక మా ఇళ్ళల్లోని మంచి కాగినపాలు ఒక్క చుక్క కూడా మిగలకుండా త్రాగుతున్నాడు. అల్లరి గోపబాలకులతో వచ్చి, నిచ్చెనకట్టి, కుండలకు తూట్లుపెట్టి మీగడ, పాలు తను త్రాగడమే కాకుండా అందరికీ ఇచ్చ

వచ్చినట్లు పంచిపెడుతున్నాడు. అంతే కాదమ్మా! మొన్న ఒక ఇంట్లో జొరబడి తను త్రాగినన్ని పాలు త్రాగి, మిగడ ఆ ఇంటికోడలు మూతికిరాచి పలాయనం చిత్తగించాడు. కోడలే దొంగనుకొని అత్తగారు దాన్ని చావుదెబ్బలు కొట్టింది. నీ కుమారుడి ఆగడాలు పడలేకుండా ఉన్నావమ్మా. ఇంకా ఇలాగే జరిగితే మేము ఈ ఊరువదలి వెళ్ళవలసి వస్తుంది, అని మొరబెట్టుకొన్నారు.

ఈ విధంగా గోపికలు బాలకృష్ణుని వినోదక్రీడలు విన్నవించగా యశోద వారినందరినీ అనునయించి, తన కుమారుణ్ణి శిక్షిస్తానని చెప్పి వారిని సమాధానపరిచి పంపింది. శ్రీకృష్ణుడికి ఈ విషయం యావత్తూ తెలిసినప్పటికీ తను ఏమీ ఎరుగని అమాయకునివలె తల్లిచాటున దాక్కొన్నాడు.

ఇట్లా ఉండగా ఒకనాడు బలరాముడు మొదలైన గోపకుమారులు పరుగు పరుగున యశోదమ్మ చెంతకు వచ్చి శ్రీకృష్ణుడు మన్ను తిన్నాడని చాడీలు చెప్పగా ఆమె వెంటనే వెళ్ళి శ్రీకృష్ణుణ్ణి చెయ్యిపట్టుకొని తీసుకొచ్చింది - ఏమిటీ ఆగడమని గుద్దురిమి అడిగింది. అంతట బాలకృష్ణుడు ఏమీ ఎరుగని వాడిలాగా - అమ్మా! నీవు వీరి మాటలు ఎందుకు నమ్ముతావు? మన్ను తినడానికి నేనేం పారాడే పసిపాపనా, లేక వెర్రివాణ్ణి అనుకున్నావా? వీరు అబద్ధాలు చెపుతున్నారమ్మా. పోనీ నా మాటలో నమ్మకం లేకపోతే- నా నోరు వాసన చూడమ్మా!, అని లీలా మానుష విగ్రహుడైన ఆ ఈశ్వరుడు నోరు తెరచి చూపాడు. అప్పుడు ఆ

బాలుని ముఖంలో యశోదమ్మకు బ్రహ్మాండం యావత్తూ ప్రత్యక్షమైంది. భూమి, ఆకాశం, సప్తసముద్రాలు, సకల పర్వతాలు, దిక్కులు, దిక్పాలురు, సమస్తద్వీపాలు, సూర్య చంద్రులు - చరాచర సృష్టి యావత్తూ ఆమెకు గోచరింప సాగింది. అప్పుడామెకు తాను ఏస్థితిలో ఉన్నదీ తెలియ లేదు. దిగ్భ్రాంతురాలైంది - ఇది కలా, లేక దైవమాయా, కాక బుద్ధి చాంచల్యమా అని ఆమె చింతించసాగింది. చివరకు ఈశ్వరుడే ఈ బాలుడని నిశ్చయించుకొని, ఇక ఆ విశ్వ రూపాన్ని ఉపసంహరించవలసినదిగా బాలుని ప్రార్థించింది. అప్పుడు తనను పరమేశ్వరునిగా ఆమె భావిస్తున్నదని ఎరిగి, శ్రీకృష్ణుడు తిరిగి ఆమెను మాయాబద్ధురాలుగా చేశాడు. మాయలో పడిన వెంటనే ఆమె కన్నతల్లి బిడ్డను ఎంత ఆప్యాయంగా చేరతీస్తుందో అంత ఆప్యాయంగా శ్రీకృష్ణుని చేరదీసికొన్నది. తొడపై కూర్చోబెట్టుకొని చన్ను కుడుప సాగింది.

శుకయోగీంద్రులవారు ఈ విధంగా శ్రీకృష్ణుని బాల క్రీడలు వర్ణించి చెప్పగా పరీక్షిన్మహారాజు పరవశుడై, సాక్షాత్తు ఈశ్వరుడికి చన్నిచ్చిన ఆ తల్లి భాగ్య మెంతటిదో!- అన్నాడు. అప్పుడు శుకయోగి యశోదానందుల పూర్వ జన్మ వృత్తాంతం ఆయనకు ఎరుక చేశాడు.

ద్రోణుడను పేరుకలవాడు వసువులలో శ్రేష్ఠుడు. ధర అనే ఆమె అతని భార్య. బ్రహ్మ వారిని భూలోకంలో జన్మించ వలసినదిగా విధించాడు. అప్పుడు ఆ భార్యాభర్తలు బ్రహ్మను

ఈ విధంగా విన్నవించుకొన్నారు – విష్ణుసేవ తమకు అనుగ్రహించినట్లయితే మానవలోకంలో జన్మించడానికి తమకు ఎట్టి అభ్యంతరం లేదని విన్నవించుకోగా, బ్రహ్మ వారికి ఆ వరం ప్రసాదించాడు.

వారే యశోదా నందులు – అని పలికి శుకయోగి తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు.

నలకూబరమణి శాపవిమోచనం

రానురాను కృష్ణుని అల్లరిపనులు హెచ్చుకాసాగాయి. ఇంటిపట్టున ఉండక పొరుగిండ్లలో అల్లరిపనులు యథేచ్ఛగా చేస్తున్న చిన్నకృష్ణయ్యను ఱోటికి కట్టివెయ్యడానికి యశోదమ్మ నిర్ణయించింది. ఒక త్రాటిని తెచ్చి అతనిని కట్టివెయ్యబోగా అది రెండు అంగుళాలు తక్కువ అయింది. అంతట మరొక పెద్ద త్రాడు తెచ్చి ప్రయత్నించగా అదికూడా కొంచెం తక్కువ అయింది. ఇట్లా ఇంట్లోని త్రాళ్ళన్నీ ఒక దానికొకటి ముడిపెట్టి కట్టినను కృష్ణునికి సరిపోకపోవుటచూచి యశోదమ్మ ఆశ్చర్య చకితురాలైంది. బాలుడు సాక్షాత్తు భగవంతుడుకాని ప్రాకృత మానవుడుకాడని తెలుసుకొన్నది. తల్లి జ్ఞానవంతురాలైనదని ఎరిగి కృష్ణుడు ఇక తన మహిమను ఉపసంహరించి తనకు తానై కట్టుబడ్డాడు. తల్లి అతనిని ఱోటికి కట్టివేసింది.

అల్లరివాడైన శ్రీకృష్ణుడు ఱోటిని ఈడ్చుకొని పోగా, పోగా రెండు అర్జున తరువులు అడ్డు తగిలి అవి ఫెళ్లున కూలి

పోయాయి. ఆ రెండు మద్దిమ్రాకులనుండి ఇద్దరు ప్రసిద్ధులైన సిద్ధులు బయలువెడలి పరమాత్ముడైన శ్రీకృష్ణుని పలువిధాల ప్రస్తుతించసాగారు. వారికి శాపవిముక్తి కలిగింది. నారద మహర్షి శాపవశాత్తూ మద్దిచెట్లుగా మారిన నలకూబర మణి గ్రీవులెవరు - అని శుకయోగి చెప్పగా పరీక్షిన్నరేంద్రుడు ఆ శాప వృత్తాంత మెట్టిదని ప్రశ్నించాడు. అంతట తిరిగి శుకయోగి చెప్పసాగాడు.

కుబేరుడి కుమాళ్ళయిన నలకూబర మణిగ్రీవులు ఒక నాడు కొండకోనపై పూలతోటలో మందాకినీ వనంలో వనజాక్షులనూడి యథేచ్ఛగా క్రీడలాడుచుండగా, అప్పు డచ్చటికి నారదమహర్షి ఏతెంచాడు. ఆయనను చూచి ఆ చెలువలు వలువలు ధరించి ఒడ్డుకు వచ్చారు. కాని మదిరారసం త్రావి మైమరచి ఉండడంవల్ల మహర్షి రాక గమ నించక, వివస్త్రులై యథేచ్ఛగా విహరిస్తున్న నలకూబర మణిగ్రీవులకాంచి నారదముని కోపించి వారిని మద్ది తరు వులుగా పుడమిపై పుట్టండని శపించాడు, అంతట ఆ కుబేరుని కుమాళ్ళు ఒళ్ళు తెలిసి తమ తప్పిదాన్ని మన్నించమని వేడుకోనగా, నూరు దివ్యాబ్దములు భూలోకంలో వృక్ష రూపమున ఉండి పిమ్మట వాసుదేవుని పాదస్పర్శవలన శాప విముక్తు లయ్యెదరని నారదముని వారిని అనుగ్రహించాడు. ఆతీరుగా శాపగ్రస్తులైన కుబేరుని కొడుకులు మద్ది చెట్లుగాపుట్టి, శ్రీకృష్ణుని కృపవలన శాప విముక్తులై, ఆ శ్రీహరిని కీర్తించి తిరిగి తమ స్వస్వరూపాలతో అలకాపురికి వెళ్ళిపోయారు - అంటూ శుకయోగి మరల చెప్ప నారంభించాడు.

జంటతరువులు ఫెళ్ళున విరిగి కూలడంవల్ల పెద్ద ధ్వని విని నందాది గోపకులు పిడుగు పడినదని భీతిల్లి పరుగుపరుగున అటకు వచ్చి చూచారు. విరిగిన మద్ది మ్రాకులను, వాటి చెంత ఱోలికి కట్టివేయబడి ఏమాత్రం బెదురులేక చూస్తున్న చిన్ని కృష్ణయ్యను కాంచి ఆశ్చర్యచకితులయ్యారు. ఇంత పని జరిగితే ఈ పసివాడెట్లా బ్రతికాడని ముక్కుమీద వ్రేలు వేసుకొన్నారు. పిడుగు పడలేదే? పిల్లవాడీపని చేయలేడే? కారణం లేకుండా చెట్లు ఎట్లా కూలాయని, ఇదేదో అపశకునం కాబోలని ఇలా ఒక తీరుగా శంకిస్తుండగా, అప్పుడక్కడున్న బాలకులు అసలు విషయం చెప్పారు. కృష్ణయ్య ఱోలు ఈడ్చుకుంటూ రాగా రాగా అడ్డు తగిలిన పెద్ద తరువులు రెండు ఫెళ్ళుని విరిగి నేల కూలాయని, అందుండీ ఇరువురు దివ్యపురుషులు బయటికి వచ్చారని విన్నవించారు. కాని నందాదులు బాలురు అసత్యం చెపుతున్నారని వారి మాటలు నమ్మలేదు. ఇదేదో మాయో, మహిమో అని పలువురు పలు రకాలుగా చెప్పుకొన్నారు. పిమ్మట నందుడు కృష్ణయ్య కట్లు విప్పి, ఒడలెల్ల నిమిరి ఎత్తుకొని ముద్దాడాడు.

ఈ విధంగా కృష్ణుడు ఆటలు ఆడుతూ పాటలు పాడుతూ, రోజొక్క వింత చూపిస్తూ వినోదం చేస్తూ యశోదానందులను గోపగోపీజనాన్ని ఆనందంలో ఓలలాడిస్తూ వచ్చాడు. తరువాత ఒకనాడు గోపకులలో వృద్ధుడు, జ్ఞాని అయిన ఉపనందుడనే ఆయన వచ్చి — ఇప్పటికి వ్రేపల్లెలో అనేక అపశకునాలు పుట్టాయి. అయినా బాలకృష్ణుని మహిమ వలన ఆ గండాలన్నీ గడచి ఇంతవరకు మనం బయటపడ

కలిగాం. ఇక ఇక్కడ ఉండడం శ్రేయస్కరం కాదు. తక్షణమే అందరం బయలుదేరి బృందావనం వెళ్ళిపోయి అక్కడ వసతి ఏర్పరుచుకుందాం. బృందావనంలో పచ్చని పచ్చిక సమృద్ధిగా ఉన్నది. మన ఆలమందలకు పుష్కలంగా, ఆహారం లభిస్తుంది. పైగా అది పుణ్యస్థలం. మనం సకుటుంబ సపరివారంగా వసించడానికి తగినచోటు అది. మనకు సర్వశుభములూ సమకూడుతాయి, అని సలహా ఇచ్చాడు. ఉపనందుడు చెప్పిన దానికి అంతా సమ్మతించారు. గోగోప గోపీ జనమంతా వెంటనే వ్రేపల్లె వీడి బృందావనానికి పయనమైనారు. ముందు ఆలమందలు బయలుదేరాయి. పిమ్మట బండ్లు కట్టారు. వృద్ధులు, బాలురు, స్త్రీలు బండ్లలో కూర్చొన్నారు. సమస్త సామగ్రులు శకటాలమీద కెక్కించారు. రోహిణి, యశోద, బలరామకృష్ణులు, ప్రత్యేకంగా ఒక దివ్య రథంలో కూర్చొన్నారు. మంగళతూర్యారావములు మ్రోగుతుండగా బారులు తీరిన బండ్లు కదిలాయి. దారిపొడువున శుభశకునాలు పొడసూపుతుండగా నందాది గోపకులు ప్రయాణంచేసి బృందావనం చేరుకున్నారు. అక్కడ సమస్త సౌకార్యాలతో వసతులు ఏర్పాటు చేసుకొని ఉంటూ వచ్చారు. బృందావనం అందరినీ ఆకర్షించింది. ఆలమందలు పచ్చనిపచ్చిక కడుపారమేస్తూ విచ్చలవిడివిహరించజొచ్చాయి. గోపాలకులు వివిధ వినోదక్రీడల తేలుతూ సుఖించారు. అందని అందచందాలతో వెలుగొందుతున్న బృందావనం, యమునాతటి,- అక్కడ రామకృష్ణులు వివిధ వినోదక్రీడల తేలుతున్నారు. కృష్ణుడు గొల్లపిల్లల కూడి పిల్లనగ్రోవి ఊదుతూ

యమునాతీరంలో యథేచ్ఛగా విహరిస్తున్నాడు. ఆ వేణు గానం జగత్తును మోహింప చేస్తున్నది.

## వత్సాసుర బకాసురుల వధ

ఇట్లా ఉండగా ఒకనాడు – రామకృష్ణులు మామూలుగా తోటి గోపాలురతోడ ఆలమందల మేపుతూ యమునా తీరంలో విహరిస్తున్నారు. అప్పుడు రాక్షసుడొకడు ఆవు రూపం ధరించి మందలో ప్రవేశించాడు. ఆదుష్టుడి చేష్టలు ఏమీ ఎరుగనట్లే ఉండి ఒక కంటకనిపెట్టనే కనిపెట్టాడు బాల కృష్ణుడు. వెంటనే బలరాముడికి దానిని చూపి, తాను మెల్ల మెల్లగా దగ్గరికి వెళ్ళాడు. దాని కాళ్ళు తోక గట్టిగా పట్టు కొని గిన్నె గిరగిర తిరిగినట్లు గిరగిర త్రిప్పి నేలపై విసరి కొట్టాడు. తక్షణమే ఆవురూపంలో ఉన్న ఆ రక్కసుడు విలవిల తన్నుకొనుచు ప్రాణాలు విడచాడు. అసురుని చావుకు అమరులు సంతసించి విరులవాన కురిపించారు. కృష్ణుని నేనోళ్ళ కీర్తించారు.

తరువాత ఒకనాడు ప్రొద్దు పొడుపుననే గోపబాలకులు గోవుల తోలుకొని అడవికి వెళ్లారు. అక్కడ మందలకు నీళ్ళు తాపుకొని తాము చద్ది అన్నాలు తిందామని ఒక కాళింది మడుగును సమీపించారు. తాము అన్నాలు తిని, గొడ్లకు నీళ్ళు తాపుకొని వస్తుండగా వారికి ఆ మడుగుచెంత కొండంత కొంగ ఒకటి కనుపించిది. వాడే బకాసురుడు. వాణ్ణి చూచీ చూడడంతోనే గోపకుమారులంతా భయంతో వణకి పోయారు. బకాసురుడు పర్వతంలా ఎగిరివచ్చి బాలకృష్ణుని

పెట్టుకొన్నాడు. గుహలా ఉన్న నోట్లో వేసుకొని గుటుక్కున
మ్రింగాడు. అంతటితో గొల్లపిల్లలంతా గొల్లున ఏడ్వసాగారు.
కాని భగవంతుడైన కృష్ణుడు మ్రింగుడు పడక అసురుని
కంఠానికి అడ్డు నిలిచాడు. గొంతుకొయ్యన నిలుచున్నట్లు నిలు
చుండి ఒక క్షణంలో ఉన్న ఆ దానవుని ముక్కులు రెండు
పట్టి దోసబద్ద చీల్చినట్లు చీల్చివేశాడు కృష్ణుడు. వాడు
ముక్కలు ముక్కలు నెత్తురు కక్కుతూ నేలకూలి గిలగిల తన్ను
కొని ప్రాణాలు విడిచాడు. అప్పుడు దేవ దుందుభులు
మ్రోగాయి. సురలు శ్రీకృష్ణునిపై పూలవానలు కురిపిం
చారు. గోపబాలకులంతా మహదానందం పొందారు.

పిమ్మట వారంతా ఆలమందల తోలుకొని బృందావనం
చేరుకున్నారు. గోపబాలురవలన సకల వృత్తాంతమూ విని
నంద యశోదాది గోపగోపీజనం విస్మయమంది శ్రీకృష్ణుడు
సాక్షాత్తు నారాయణుడుగా భావించి పూజిస్తూ వచ్చారు.
ఇట్లా రామకృష్ణుల కౌమారదశ గడచింది.

## అఘాసుర వధ

అంతట ఒకరోజు శ్రీకృష్ణునికి వనభోజనాలు చెయ్యా
లని బుద్ధి పుట్టింది. ఆ విషయం స్నేహితులైన గోపబాలకు
లందరికీ చెప్పాడు. వారు మహదానందంతో అంగీకరించి
అందుకు అవసరమైన సర్వసన్నాహాలు చేశారు. వేనవేలు
గోపబాలకులు వేకువనే లేచి శ్రీకృష్ణసహితులై వనభోజ
నాలకు పయనమైనారు. మంగళ తూర్యారావములు మ్రోగిం
చారు. శంఖాలు పూరించారు. వేణువులు ఊదారు. ఆల

మందలు బయలుదేర తీశారు. అన్నపు కావళ్ళు బుజాలకెత్తికున్నారు. వనభోజనాలకు వెళ్ళి బలరామ కృష్ణులు గోప బాలకులగూడి ఆడుతూ పాడుతూ, వివిధ వినోదముల చేస్తూ విహరిస్తుండగా బకునకు పూతనకు తమ్ముడైన అఘాసురు డనేవాడు కంసుని పంపున కృష్ణుని సంహరింప అక్కడికి అరుదెంచాడు. తన అన్నను అక్కను సంహరించిన కృష్ణుని చూచి క్రోధారుణాలోచనాలు దీపింప ఇప్పుడీ కృష్ణుణ్ణి సపరివారంగా సంహరించి పగతీర్చుకుంటాను. కంసుడికీ ముదము చేకూరుస్తాను, అని అనుకొన్నవాడై ఆమడ పొడవున, పర్వతం లావున ఘోర అజగరాకారంతో గుహవంటి నోరు విప్పుకొని వారల మ్రింగ సంసిద్ధుడై ఉన్నాడు. అప్పుడు గోప బాలకులు దూరంనుంచి ఈ భయంకరాకారం చూచి భ్రమ చెంది, వాస్తవం తెలియక బాల్య చాపల్యమున ఒకరితో ఒకరు పరాచకాలాడుకుంటూ, నవ్వుకుంటూ దాని విషయం పలు విధాలుగా చెప్పసాగారు. వారి పలుకులు విని కృష్ణుడు ఇది అజగరంకాదు, రాక్షసుడీరూపంలో ఉన్నాడు, మీరు తొలగిపొండి, అని హెచ్చరించాడు. కాని అంతలో గోప బాలురు దాని నోట ప్రవేశించారు. అయినా ఆ రాక్షసుడు కృష్ణుని రాకకోసం నిరీక్షిస్తుండగా, భగవంతుడు సర్వమూ అవలోకించి గోప బాలకుల కావ నెంచి దానినోట ప్రవేశించాడు. అప్పుడు ముప్పదిమూడుకోట్ల దేవతలు భీతిల్లారు. కంసాది రాక్షసులు సంతసించారు. అంతట సర్వాంతర్యామి అయిన శ్రీకృష్ణుడు దేహాన్ని మిక్కుటంగా పెంచిన వాడై బ్రహ్మాండ భాండాన్ని బ్రద్దలు కొనివచ్చినట్లు

అఘాసురుని కాయం చీల్చుకొని బయటికి వచ్చాడు. మృత ప్రాణులైన గోగోప జనాన్ని పునర్జీవితుల కావించాడు. అఘాసురుడు ఇట్లు సంహరింపబడగా సురలు విమానారూఢులై తరలివచ్చి, పరమాత్మపై సుమవర్షం కురిపించారు. తరువాత కృష్ణుడు గోవులను గోపబాలకులను తోడ్కొని వనానికి వెళ్ళాడు. అక్కడ ఆలమందలను పచ్చికమేయ వదలి వారంతా ఆడుతూ, పాడుతూ వనభోజనాలు ఆరగించారు. అట్లు వారు వినోదక్రీడల తేలుచుండగా, కసవుమేస్తున్న గోగణం దూరదూరంగా వెళ్ళిపోయింది. అంతట గోవులు కాచే బాలకులు ఆలమందలు అగుపించనందున కళవళపడి ఆ విషయం కృష్ణుడితో చెప్పారు. కృష్ణుడు వారిని ఊరడించి, వారిని అక్కడే ఉండ నియమించి తాను గోవుల వెదకుటకై బయలుదేరాడు.

అప్పుడు బ్రహ్మదేవుడు ఒక ఉపాయం పన్నాడు. అంతవరకూ అఘాసురుణ్ణి హతమార్చి గోగోపజనాన్ని బ్రతికించిన శ్రీకృష్ణుని లీలలు పైనుండి చూస్తూనే ఉన్నాడా బ్రహ్మదేవుడు. ఇంకా ఆ పరమాత్ముని మహిమలు తెలియ కుతూహలం కలవాడై ఆయన గోవులను, గోపాలకులను ఎవరికీ కనుపించకుండా మాయంచేసి ఎక్కడో దాచివేశాడు. పిదప కృష్ణపరమాత్మ ఏంచేస్తాడో చూదామని కనిపెట్టుకుని ఉన్నాడు. అప్పుడు భగవంతుడైన శ్రీకృష్ణుడు ఆవులను వెదకి వెదకి అవి ఎక్కడా కనిపించనందున తిరిగి వనానికి వచ్చి చూచేటప్పటికి అక్కడ గొల్లపిల్లవాండ్రు కూడా మాయమైనారు. అంతట ఆ పరమాత్మ ఒక్కక్షణం ఆలోచించి ఇది బ్రహ్మదేవుడు చేసిన మాయ అని తెలుసు

కొన్నాడు - కానీ చూద్దాం. బ్రహ్మయ్యను మరింత పరీక్షించి నమస్కరిస్తే చేద్దాం అనుకున్నాడు. ఆ మాయామానుష వేష ధారి తత్క్షణం తన మహిమను ప్రదర్శించాడు. ఎంతమంది గొల్లపిల్లవాండ్రున్నారో అందరినీ మళ్ళీ సృష్టించాడు. ఎన్ని ఆవులు, దూడలు ఉన్నాయో అన్నింటినీ మళ్ళీ పుట్టించాడు. ఇట్లా అన్నిరూపాలు తానే ధరించి, అన్ని ఆత్మలలో తానే భరించి మహాద్భుతం చేశాడు ఆ విశ్వరూపుడు. తరువాత మామూలుగా ఆలమందలను, గోపబాలకులను వెంట నిడుకొని వేణునాదం చేస్తూ తిరిగి బృందావనం చేరుకొన్నాడు. బృందావనంలో గోపగోపీజనం ఎవ్వరికీ ఈ కృష్ణమాయ ఎరుకపడలేదు. గొల్లపిల్లలంతా ఎవరి ఇళ్ళలో వారున్నారు. ఎవరి మందలలో ఆవులు దూడలు వారిమందలలో ఉన్నాయి. ఏ విషయంలోనూ, ఇంచుకంతయు భేదంలేదు. ఈ మందలు మాయమందలనీ, ఈ పిల్లలు మాయపిల్లలనీ ఒక ఆ కృష్ణ పరమాత్మకు తప్ప మరెవ్వరికీ తెలియదు. ఈ విధంగా శ్రీ కృష్ణుడు 'సర్వం విష్ణుమయం' చేసి, పలురకాల లీలావిలాసం చూపి, మహాద్భుతం ప్రదర్శించాడు. ఈ విధంగా ఒక ఏడాది గడచింది. కాని బ్రహ్మదేవుడికి అది తృటి మాత్రమే అయింది. అప్పుడాయన తీరా పరిశీలించి చూచేటప్పటికి శ్రీ కృష్ణుడు గోవులతోను, గోపాలకులతోను బృందావనాన్ని కన్నులపండువ కావిస్తూ కనుపించాడు. ఆశ్చర్య చకితుడై నాడు. తాను గోగణాన్ని గోపబాలురను దాచివేస్తే, కృష్ణుడు తిరిగి సృష్టించి ఎప్పటివలె, వినోదక్రీడా విలాసాలు చూపుతున్నాడు! ఆ మహనీయుని మహిమ ఎంత పరమాద్భుత

నైనది! హరిమాయ ముందు బ్రహ్మమాయ ఎంత! బ్రహ్మ బొమ్మవలె నిశ్చేష్టుడై ముంట నిలుచుండి చూచాడు. తన అవివేకానికి చింతిల్లాడు. భగవంతుని లీలావిలాసాలు మనస్సులో తలచుకొని తన్మయుడైనాడు. ఎకాఎకి నింగినుండి నేలకు దిగి కృష్ణుని చెంతకు వచ్చాడు. చేతులెత్తి ప్రణతుడై హృదయం ఉప్పొంగ, మేనెల్ల పులకరింప, ఆ భగవంతుని వేదమంత్రాలతో స్తుతించాడు చతురాననుడు. అట్లా స్తుతించి పలుమారులు మ్రొక్కి పరమాత్మ అనుజ్ఞ వడసి తిరిగి తన లోకానికి వెళ్ళిపోయాడు. ఈ తీరుగా కృష్ణుడు బ్రహ్మకు జ్ఞానోదయం అయ్యేటందుకు త్రుటికాలంలో మాయకల్పించి అందరినీ అందులో ముంచి, తిరిగి దానిని ఉపసంహరించి, గోవులను వెదక వెళ్ళివచ్చినట్లుగా వచ్చి, గోపబాలురున్న ప్రదేశానికి వచ్చాడు. అప్పుడు గొల్లపిల్లలంతా అన్నాలు తినబోతూ, ఇంకా కృష్ణుడు రాలేదని చేతిలో ముద్దలు చేతిలోనే ఉంచుకొని అట్లాగే కనిపెట్టుకొని ఉన్నారు. కృష్ణుడు కంటపడడంతోనే వచ్చావయ్యా కృష్ణయ్యా! త్వరగానే వచ్చావే, ఒక్కముద్దయినా తినకుండా నీకోసమే కూచున్నామయ్యా, రా, త్వరగా కానిద్దాం – అంటూ అన్నానికి పిలిచారు. పాపం విష్ణుమాయా మోహితులైన ఆ గొల్లపిల్లలకు ఈ మధ్యలో జరిగిన కథ తెలియనే తెలియదు. అంతట కృష్ణుడు వారితో కలసి చల్ది భుజించి, పిమ్మట అందరూ కలసి ఆడుతూ పాడుతూ ఆలమందల తోలుకొని బృందావనం చేరారు. శ్రీకృష్ణుడు గోపబాలకులతో వనభోజనాలు చేసిన కథ, అఘాసురవధ, బ్రహ్మ పన్నిన పన్నాగం, విష్ణుమాయా

విలాసం - ఈ కథలన్నీ విన్నవాడికిన్నీ, చదువుకొన్న వాడి కిన్నీ సర్వార్థ సిద్ధులు లభిస్తాయి - అంటూ శుకయోగి తిరిగి చెప్పనారంభించాడు.

## ధేనుకాసురవధ

ఈ విధంగా రామకృష్ణులకు కౌమారదశ గడచింది. వయస్సు వచ్చింది. వారు గోపకన్యలతోను, గోపాలురతోను ఆడుతూ పాడుతూ బృందావనం పావనం చేస్తున్నారు. ఇట్లా ఉండగా ఒకనాడు బలరామకృష్ణులు తమ చెలికాండ్ర వెంట నిడుకొని వనవిహారం వెళ్లారు. అక్కడ రకరకాల ఆటలు ఆడుకొన్నారు. ఒకరి నొకరు నవ్వించుకుంటూ, కవ్వించు కుంటూ వినోదక్రీడల తేలిపోయారు. ఎన్నెన్నో చిలిపిచేష్టలు చేసి ఆనందించారు. చెట్లెక్కి పుట్టలెక్కి, ఒకరి నొకరు వెక్కిరించుకుంటూ కోతికొమ్మంచులాడారు. పొదలమధ్య దాగుడుమూతలాడుకొన్నారు. ఇట్లా వారు ఆడి ఆడి అలసి పోయి చెట్లనీడలో కూర్చుని ఉండగా, అప్పుడు వారిలో శ్రీరాముడు, సుబలుడు ఆదిగాగల గోపాలురు రామకృష్ణుల కడకు వచ్చి - ఏమయ్యా, బలరామయ్యా! శ్రీకృష్ణయ్యా! మీ ఇరువురితో ఒకమాట చెప్పాలనుకుంటున్నాం ఇక్కడికి దాపుల్లో ఒక పెద్ద తాటివనం ఉన్నది. ఇంతింతలావు తాటి పండ్లు పండి గుత్తులు గుత్తులు వ్రేలాడుతున్నాయి. చూడండి! ఇంతదూరానికి కూడా ఎట్లా గుమగుమ వాసనలు వస్తున్నవో! మాకేమో ఆకలి దప్పులు అమితంగా వేస్తున్నవి. ఆ తాటి పండ్ల మాట తలుచుకుంటే మాకు నోళ్ళు ఊరుతున్నవి.

అక్కడికి వెళ్ళి పండ్లు రాల్చుకొని తిందామంటే ఒకటే చిక్కు. ఆ వనంలో ధేనుకుడనే పెద్ద రాక్షసుడొకడున్నాడు. వాడు అమితమైన బలం కలవాడు. ఆ వనానికి వాడే రాజు. మరెవ్వరినీ అక్కడ అడుగుపెట్టనివ్వక వనంలో పండ్లన్నీ వాడొక్కడే తింటున్నాడు. వాడికి భార్యాబిడ్డలతో, బంధు పరివారంతో ఆ వనంలో నివసిస్తూ అక్కడికి ఎవరినీ చేరనివ్వక విచ్చలవిడి విహరిస్తున్నాడు. ఇంతకాలంగా వాడికి, మేము భయపడి ఆ చాయల పోలేకుండా ఉన్నాం. మీ రిరువురూ మహాత్ములు, మహాబలశాలురు; ఎట్లాగైనా మీరు వాణ్ణి సంహరించి మాకు ఆ తాటిపండ్లు తినే ప్రాప్తం కలిగేటట్లు చెయ్యండి. వాడు పెద్దగాడిద ఆకారంతో అక్కడ కాపలా కాస్తున్నాడు. వేగిరం వెళ్ళి మా కోర్కె నెరవేర్చండి, అని వేడుకొన్నారు. చెలికాండ్ర పలుకులు విని రామకృష్ణులు చిరునవ్వులు చింద, తాటివనానికి పయనమైనారు.

బలరామకృష్ణులు, గోపబాలురు దాపులోనే ఉన్న తాటి తోపులో ప్రవేశించారు. బలరాముడు తన బాహువులతో తాటిచెట్లను పట్టి ఊపాడు. ఆ ఊపుకు పండ్లన్నీ ఝల్లున రాలాయి. ఆ ధ్వని విని గార్దభ రూపంలో ఉన్న ధేనుకాసురుడు దిక్కులు పిక్కటిల్లేటట్లు ఓండ్ర పెట్టాడు. ఆ అరుపునకు కొండలు కదిలాయి. సమస్త ప్రాణుల హృదయాలూ కలత చెందాయి. ఈ విధంగా ధేనుకాసురుడు ఆర్భాటంతో వచ్చి బలరాముని ఎదుర్కొన్నాడు. అప్పుడు ఆదిశేషావతారమైన బలరాముడు ఏమాత్రం చలించక ధేనుకాసురుని వెనుక కాళ్ళు రెండూ పట్టి ఎత్తి లోకాలు

మెచ్చి గిరగిర త్రిప్పి నేలపై విసరివైచాడు. తక్షణమే వాడు ప్రాణాలు విడిచి దాపులోని తాటిచెట్టుపైన పడ్డాడు. దాని వలన ఆ తాటిమాను ఊగి మరొక చెట్టుపై విరిగి పడ్డది. అది తిరిగి మరొక దానిపైన కూలింది. ఇలాగ తాళ వృక్షాలన్నీ ఫెళ్ళు ఫెళ్ళున తిరిగి ఒక్క దెబ్బన కూలిపోయినాయి. అంతట ధేనుకాసురుడు మృతిచెందుట కాంచి వాడి పరివారమంతా ఒక్క పెట్టున వచ్చి బలరామకృష్ణులను తాకింది. అయినను వారిరువురు చలించక రాక్షససేనసంతా నుగ్గు నుగ్గు చేసి శత్రు నిర్మూలనం కావించారు. దురాత్ముడైన ధేనుకాసురుడు సపరివారంగా మడిసినందుకు లోకాలన్నీ బలరామకృష్ణులను కీర్తించాయి. ఆనాటినుంచి ఆ తాటితోపు అందరికీ ప్రవేశార్హమైంది. అందరూ తమ ఇచ్చ వచ్చినట్లు తాటిపండ్లు భుజించసాగారు. గోపబాలకులు ఎంతగానో సంతస మందారు. ఆ తరువాత మరొకనాడు బలభద్రుడు లేకుండా కృష్ణుడొక్కడు గోవులను గోపాలకులను వెంట నిడుకొని అడవికి వెళ్లాడు. అడవిలో ఆలమందలు తిరిగి తిరిగి ఎండకు సుడిపడి దప్పిగొన్నాయి. అప్పుడు గోపాలకులు మందల తోలుకొని కాళిందిమడుగు తీరానికి వెళ్ళారు. ఆ మడుగులో జలం విషపూరితం అయిన కారణాన నీరు త్రాగిన గోవులన్నీ వెంటనే విలవిల తన్నుకొనుచు ప్రాణాలు కోల్పోయినాయి. గొల్లపిల్లవాండ్రంతా తెలివితప్పి ఎక్కడివారక్కడపడి ప్రాణాలువిడిచారు. అప్పుడు కరుణార్ద్రహృదయుడైన ఆ శ్రీహరి కృష్ణపరమాత్మ తన అమృత కటాక్ష వీక్షణమాత్రముననే గోవులను, గోపాలకులను బ్రదికించాడు.

పిదప కాళిందిమడుగు విషపూరితం కావడానికి కారణభూత మైన ఒక కృష్ణసర్పం మడుగునుండి వెలికి రాగా కృష్ణుడు దాని మద మడంచాడు. ఆ సర్పరాజును అక్కడనుంచి పారద్రోలి నదీ జలాలను పరిశుద్ధం కావించాడు – అని చెప్పాడు శుకయోగి. అది విని పరీక్షిన్మహారాజు ఆ కాళింది మడుగులో ఉన్న కృష్ణసర్పం కథ ఏమిటో సవిస్తరంగా చెప్పవలసినదని కోరాడు. అంతట శుకయోగి మరల ఇట్లా చెప్ప నారంభించాడు.

## కాళియ మర్దనం

కాళింది నదిలో ఒకానొక మడుగు ఉన్నది. ఆ మడుగులో కాళియుడనే నాగేంద్రుడు తన భార్యాబిడ్డలతో కాపురం ఉంటున్నాడు. వాడివలన మడుగులో జలంయావత్తూ విషపూరితమైంది. కాళియుడి విషాగ్ని జ్వాలలు అంతటా వ్యాపించి అహర్నిశలూ నిప్పులు చెరుగుతుంటాయి. అందువలన ఆగాలి సోకినా, ఆ నీరు త్రాగినా, ఏ ప్రాణీ మరి బ్రతుకదు. మనుష్యులేకాదు. పశుపక్ష్య మృగాదులు సహితం కాళిందిమడుగునుంచి వచ్చే గాలి పీలిస్తే ప్రాణాలు విడువవలసిందే, మడుగులో నీళ్ళు ఎల్లప్పుడూ విషాగ్నిలో తుకతుక ఉడుకుతూ పొంగులు వారుతుంటాయి. పైన పోయే పక్షులు ఈ విషాగ్నిలో మగ్గిపోయి ప్రాణాలు విడిచి మడుగులో పడుతుంటాయి. ఇంతటి భీభత్సంగా ఉన్న ఈ మడుగును చూచి శ్రీకృష్ణుడు ఆగ్రహించాడు. ఈ విషాన్ని నిర్విషం చేయ సంకల్పించాడు. ప్రాణికోటిని కావ నెంచాడు.

ఇట్లా సంకల్పించినవాడై ఆ మహానుభావుడు నది ఒడ్డున ఉన్న ఒక పెద్ద కదంబ వృక్షం ఎక్కాడు. కాశు బిగించాడు బాహువులు అప్పళించాడు. మహా వేగంతో కొమ్మమీది నుంచి ఎగసి మడుగులో దుమికాడు. ఆ వేగానికి మడుగు యావత్తూ ఊగిపోయింది. దిక్కులు పిక్కటిల్లేటట్లు గుబగుబ ధ్వని పుట్టింది. సర్ప విషంతో జలం పొంగెత్తింది. విషకషాయిత కల్లోలా భీలమై, కలగి చుట్టూ నూరు అమ్ముల పెట్టు పొంగింది కాళింది. శ్రీకృష్ణుడు మహాభయంకరంగా మదగజంలా మడుగులో ఈదేటప్పటికి అలలు అల్లకల్లోలమై మింటికెగ శాయి. ఆ తాకిడికి చెదరి, బెదరి తన మడుగులో ఎవడో మానవుడు ఇప్పవచ్చినట్లు విహరిస్తున్నాడని ఆగ్రహావేశు డైనాడు కాళియుడు. తన విషాగ్ని జ్వాలలతో భస్మం కావించనెంచి మడుగు వెడలి వచ్చాడు. కృష్ణుని ఒడలంతా కఱచాడు. ప్రతి అవయవం కాటువేసి ఆ మహనీయుని శరీరం గట్టిగా చుట్టుకొన్నాడు. శేషశాయి, వైకుంఠధాముడు అయిన ఆ శ్రీకృష్ణుడు నాగపరివతుడై అటు ఇటు కదలక ఉన్నాడు. అది చూచి ఒడ్డున ఉన్న గోపాలకులు భయ విచలితులై తమ చెలికానికి అపద వాటిల్లినదని నేలమీదపడి పెద్ద పెట్టున ఏడ్వసాగారు. ఆవులు, దూడలు, ఎద్దులు కృష్ణుణ్ణి చూచి అతి దీనంగా కన్నీరు కార్చుతూ అంబా అని మోజులు పైకెత్తి అరవసాగాయి. ఇక్కడ ఇట్లా ఉండగా అక్కడ బృందావనంలో అనేక అశుభశకునాలు పొడగట్టాయి. అవి చూచి నందాది గోపకులు, యశోద ఆదిగాగల గోపికలు కృష్ణున కేదో కీడు వాటిల్లినదని భీతిల్లారు. నేడు కృష్ణుడు

బలరాముడు తోడు లేకుండా ఒంటిగా వెళ్ళాడు. తప్పక ఏదో ముప్పు ముంచుకొచ్చింది అంటూ దుఃఖించడం మొదలు పెట్టారు. కృష్ణుని మహిమ ఎరిగిన బలభద్రుడు మరేమీ భయంలేదని వారిని ఓదార్చ ప్రయత్నించాడు. అయినా వారి మనస్సులు కుదుట పడలేదు. అతిశోక భయాకులం చిత్తులై, బాలురు, వృద్ధులు స్త్రీలు – అందరూ బలరాముణ్ణి వెంట నిడుకొని యమునాతీరానికి బయలు దేరారు. బృందా వనం మొత్తం అక్కడికి కదలి వచ్చింది. వారంతా కాళింది మడుగులో కాళీయ నాగుచే చుట్టుకొనబడి కదలక, మెదలక ఉన్న కృష్ణయ్యను చూచి భోరున ఏడ్వసాగారు. ఆయనపైగల రాగమోహాలవల్ల గోపికల దుఃఖం వర్ణించ నలవికాకుండా ఉన్నది. కొందరు కన్నులు మూసుకొన్నారు. కొందరు భూమిపై బడి పొర్లుతూ భోరున దుఃఖించ సాగారు. ఇక యశోదానందుల దుఃఖం ఇంత– అంత అని చెప్ప తరం కాదు. కుమారుని స్థితి చూచి వారు మూర్ఛపోయి జీవచ్ఛవాల్లాగ పడి ఉన్నారు. ఒక్క బలరాముడు మాత్రం హరి మహిమ ఎరిగిన వాడు కావున నిశ్చింతగా ఉన్నాడు. ఈ విధంగా నానా భీభత్సంగా ఉన్న తరుణంలో కృష్ణుడు ఒక్క క్షణకాలం సామాన్య మానవుని వలె కనుపించి అంతలో విశ్వరూపం తాల్చాడు. ఒక్కమారు మేను విదలించాడు. దానితో కాళీయుడు అల్లంత దూరాన పోయి పడి నిస్తేజుడై చేయునది లేక విషాగ్ని జ్వాలలు వెలువడ బుసలు కొట్టుతూ ఉండిపోయాడు. అప్పుడు ఆ యశోదానందనుడు కాళీయుని పడగలపై ఎక్కి త్రొక్కాడు. సకల కళామూర్తి అయిన శ్రీకృష్ణుడు

కాళియ ఫణిఫణా మంటపమున తాండవ నృత్యాం సలిపాడు. ఆ శ్రీహరి ఆటా పాటా చూచి సిద్ధులు, సాధ్యులు, చారణులు, గంధర్వులు, దేవకన్యలు, మునిపత్నులు పూలవాన కురిపించారు. ఇట్లా తాండవ మాడగా కాళియుడి గర్వం అణిగింది. నోట నెత్తురు కక్కాడు. కంఠగత ప్రాణుడై ఆయనను శ్రీమన్నారాయణునిగా భావించి మనస్సులో శరణు వేడుకొన్నాడు. అంతట చావ సిద్ధమై ఉన్న భర్తను చూచి నాగ కాంతలు చింతా క్రాంతలై తమ పిల్లలతో సహా వచ్చి శ్రీకృష్ణుని పాద పద్మములు ఆశ్రయించారు. ఆయనకు మ్రొక్కి పలువిధాల ప్రస్తుతించి పతిభిక్ష పెట్టమని వేడుకొన్నారు. అప్పుడు భక్తవత్సలుడైన ఆ భగవంతుడు తాండవం చాలించి కాళియుని విడిచిపుచ్చాడు. అంతట నాగేంద్రుడు దైన్యం దీపింప బద్ధాంజలుడై శ్రీహరి పాద పద్మముల ఆశ్రయించాడు. అప్పుడా మహానుభావుడు కరుణించి నాగరాజును పిలిచి ఇట్లా ఆజ్ఞాపించాడు – ఓయీ సర్పరాజా! నీవిక ఇక్కడ ఒక్క క్షణంకూడా ఉండరాదు. వెంటనే నీ భార్యా పిల్లలతో మడుగు విడిచి సముద్రానికి వెళ్ళు. ఇప్పటినుంచీ ఈ కాళిందిమడుగు నిర్విషమై, నిర్మలమై నరులకు, సమస్త జంతుజాలమునకూ భోగ్య మవుతుంది. ఎవరైతే ఈ నీ కథ చెప్పూ మాపూ కీర్తిస్తారో వారికి సర్పభయం ఉండదు. విషం అంటదు. ఈ కాళింది మడుగులో స్నానం ఆచరించి దేవతలకు, పితరులకు తర్పణం విడిచిన వారూ, ఉపవాసం ఉన్నవారూ, భక్తితో నన్ను పూజించి స్మరించినవారూ సర్వ పాపాలూ బాసి వైకుంఠంలో నివసి

స్తున్నాడు. నీవు ఏ గరుత్మంతునికైతే భయపడి రమణకద్వీపం వదలి ఇక్కడికి వచ్చావో ఆ గరుత్మంతుని భీతి ఇకపై నీకు ఉండదు. నీ పడగలపై పడిన నా పద చిహ్నాలు చూచి భక్షించడు. ఇట్లు చెప్పినమీదట కాళీయుడు కళత్ర పుత్ర బాంధవ సమేతుడై శ్రీకృష్ణుని చరణారవిందములు పూజించి అనుజ్ఞ వడసి సముద్ర మధ్యమున ఉన్న దీవికి వెళ్లిపోయాడు. కృష్ణపరమాత్మ కృపవలన నాటినుంచి కాళింది మడుగులోని జలాలు నిర్విషమై నిఖిల ప్రాణులకూ అమృతజలాలు అందిస్తున్నది - అని శుకయోగి చెప్పగా విని పరీక్షిన్మహారాజు యోగీశ్వరా! కాళీయుడు రమణకద్వీపం విడిచి ఎందుకు వచ్చాడు? అతని పూర్వవృత్తాంతం చెప్పవలసినది, అని అడిగాడు. అప్పుడు శుకయోగి మరల ఇట్లా చెప్ప నారంభించాడు.

సర్పభయంకల మానవులంతా నెలనెలా ప్రతి పర్వ దినంనాడూ సర్పాలను పూజిస్తూ వచ్చారు. వృక్షమూలంలో పుట్టలకు పాలుపోసి, వివిధ మధుర పదార్థాలు పాములకు పెట్టి తృప్తిపరుస్తూ ఉండేవారు. సర్పాలు కూడా గరుత్మంతుడికి భయపడి తమ్ము చంపకుండా ఉండేటందుకు ప్రతినెలా తమ భాగానికి వచ్చిన భక్ష్యాలు అతనికి అర్పించేటట్లు పూర్వం ఒప్పందం కుదుర్చుకొన్నారు. ఆ విధంగా సర్పాలన్నీ బ్రతుకు తుండగా కాళీయుడనేవాడు విషవీర్యంతో మదించి ఎదురు తిరిగాడు. పక్షీంద్రుణ్ణి ధిక్కరించి తన పాలు అతనికివ్వ నిరాకరించాడు. అందుకు గరుడుడు కోపించి కాళీయుని చంప వచ్చాడు. కాళీయుడు ఎదుర్కొని గరుత్మంతుణ్ణి తీవ్రంగా

కాటు వేశాడు. అంతట గరుడుడు సహించక, కనక ప్రభలు విరజిమ్మ తన డాపలిరెక్క ఎత్తి చండవేగంతో కాళియుని తన్నాడు. ఆ తాపుకు సర్పరాజు స్రుక్కి, భయమున చిక్కి, బంధుపుత్ర కళత్రాదులతో పారివచ్చి, యమునా నదిలో ఉన్న ఈ మడుగులో నక్కాడు. ఈ మడుగు చెంతకు గరుత్మంతుడు రాలేడు. అది వేరేకథ. పూర్వం ఒకప్పుడు సౌభరి అనే ముని ఈ మడుగులో తపస్సు చేస్తున్నాడు. ఒకనాడు పక్షిరాజు ఆకలిగొని అక్కడికి వచ్చాడు. మడుగులో ఉన్న మీనరాజును పట్టి భక్షించాడు. అంతట అతని భార్య అయిన మత్స్యాంగన మింటికి మంటికి ఏకధారగా దుఃఖించింది. అది విని ముని జాలిగొని, ఆ చేపలను రక్షింపబూని, ఇక ఈ మడుగులో అడుగు పెట్టినచో గరుత్మంతుడు చస్తాడని శపించాడు. ఆ కారణాన గరుత్మంతుడీమడుగుచాయలకు రాడు. అందువల్లనే కాళియుడిక్కడికి వచ్చి నిర్భయంగా నివసించాడు—

ఇట్లా కాళియుని గర్వమడచి దివ్యప్రభలతో మడుగు వెడలివచ్చాడు కృష్ణుడు. అప్పుడందరికీ ప్రాణాలు లేచి వచ్చాయి. యశోదానందులు, బలరాముడు, రోహిణి తక్కిన గోపగోపీజనం కృష్ణుని కౌగిలించుకొని పరమానంద భరితులైనారు. ఆవులు, దూడలు ఉల్లాసంతో చెంగు చెంగున దూకుతూ ఉరుకులు పెట్టాయి. ఎద్దులు రంకెలు వేశాయి. ఆ రాత్రి అందరూ ఆ యమునాతీరంలోనే గడిపారు.

గోగోప గోపీజనం అంతా అలసి - సొలసి రేయి నిద్రిస్తుండగా - అక్కడ అడవిలో ఒక కార్చిచ్చు పుట్టింది.

వృక్షి అంతకంతకూ విస్తరించి వారిని చుట్టు ముట్టింది. నిద్రి స్తున్న వారంతా గొల్లలు లేచి కృష్ణుణ్ణి శరణు వేడారు. అప్పుడా విశ్వేశ్వరుడు - అనంతశక్తియుతుడై ఆ కార్చిచ్చును పానం చేసి నిఖిల గోగోప గోపీజనాన్ని కాపాడాడు. పిదప తెల్లవారగనే సకల జనులు కీర్తిస్తూ వెంటరాగా బలరామకృష్ణులు బృందావనం చేరుకొన్నారు. అంతలో గ్రీష్మఋతువు ఆసన్నమైంది. కృష్ణపరమాత్మ పెరుగుతున్న ఆ బృందావనంలో గ్రీష్మం కూడా వసంతంలా అతిరమణీయమై చూపట్టింది.

## ప్రలంబాసుర వధ

ఇట్లా ఉండగా ఒకనాడు రామకృష్ణులు కొండలలో, కోనలలో అడవులలో, నదీతీరాలలో, ఆలమందల మేపుతూ, సంచరిస్తున్నారు. అప్పుడు ప్రలంబుడనే రక్కసు డొకడు రామకృష్ణుల సంహరింప నడుముకట్టినవాడై గోపాలకుని వేషంలో అక్కడికి వచ్చాడు. సర్వదర్శనుడైన కృష్ణుడు వెంటనే కని పెట్టి ఏమీ అనక అతనితో చెలిమిచేశాడు. గొల్లపిల్లలందరినీ పిలిచి, అందరం రెండు జట్లుగా విడిపోయి బంతిఆట ఆడుదామని చెప్పాడు. ఓడినవారు గెలిచిన వారిని మోసేట్లు ఒప్పందం చేశారు. అట్లాగే ఆట మొదలైంది. పిల్లలు రెండు జట్లుగా విడిపోయారు. ఒకజట్టుకు రాముడు ఒకజట్టుకు కృష్ణుడు నాయకులుగా ఉన్నారు. రాముడి జట్టులో శ్రీదాముడు, వృషభుడు ఆదిగాగల గోపాలురున్నారు. కృష్ణుడి జట్టులో భద్రసేనుడు, మాయవేషంలో ఉన్న ప్రలంబుడు మొదలైన పిల్లలున్నారు. ఇట్లా నమ ఉజ్జీలు వేసుకొని ఆటకు

పూనుకున్నారు. ఇట్లా ఆడుతూ వారు భాండీరకం అనే వృక్షి తోపుదాకా గోవులను తోలుకొని వెళ్లారు. చివరకు ఆటలో కృష్ణుని జట్టు ఓడింది. రాముని జట్టు గెలిచింది. ఒప్పందం ప్రకారం శ్రీరాముడనేవాణ్ణి కృష్ణుడుమీద ఎక్కించుకొని మోశాడు. అట్లాగే భద్రసేనుడు వృషభుణ్ణి, మాయగోపాలు డగు ప్రలంబుడు బలరాముణ్ణి, ఎత్తుకొని మోయసాగారు. అప్పుడు ప్రలంబుడు బలరాముణ్ణి మోస్తూ మెల్లమెల్లగా త్రోవ తప్పించి, కృష్ణునికి కనుమరుగయ్యేటట్లు దూరం తీసుకవెళ్లాడు. చివర కారక్కసుడు దీర్ఘదేహంతో, ఉగ్ర దంష్ట్రిలతో తన నిజరూపం చూపేసరికి బలరాముడు వాడొక అసురుడని శంకించాడు. వెంటనే భయపడినట్లు కనుపించి మళ్ళీ తేప్పరిల్లి వాడిమదం అణచాలని సంకల్పించాడు. మున్ను దేవేంద్రుడు వజ్రాయుధంతో పర్వతాన్ని కొట్టినట్లు బలరాముడు తన దృఢమైన పిడికిటితో ప్రలంబాసురుణ్ణి పొడి చాడు. ఆ పోటుకు వాడిశిరస్సు సహస్ర వక్కలైంది. నోట నెత్తురు కక్కుతూ నేలకూలి గిలగిల తన్నుకొంటూ మరణిం చాడు. విషయమంతా తెలుసుకొని గోపాలురు విస్మయం చెందారు. బలరాముణ్ణి కౌగలించుకొని ప్రశంసించారు. ప్రలంబాసురుడు మడిసినందులకు సంతసించి సురలు సుమ వర్షం కురిపించారు.

గోపాలకులంతా ఈ విధంగా ఆటలమరిగి స్వేచ్ఛగా విహరిస్తూ ఆలమందల విషయం పట్టించుకోలేదు. అవి అద లించేవాళ్లు లేక అడవంతా కలయ తిరిగి త్రోవతప్పాయి. అంబా అని అరుస్తూ తుదకు ముంజారణ్యానికి వెళ్లాయి.

కొంతసేపటికి రామకృష్ణులు గోపాలకులు ఆవులను కానక, విచారిస్తూ వాటికోసం అంతటా గాలించారు. పశువులు మేసిన జాడలవెంట వెళ్ళి వెళ్ళి అలసి – సొలసిపోయారు. అవి ఎక్కడా కనుపించక, చెట్టుకొకరు పుట్టకొకరుగా వనాల్లో తిరుగసాగారు. అప్పుడు కృష్ణుడు ఒక పెద్ద చెట్టు ఎక్కి చూచి ఆలమందలున్న జాడ కనిపెట్టాడు. వాటిని పేరు పేరున ఎలుగెత్తి పిలిచాడు. గోపాలకృష్ణుని పిలుపుకు గోవులన్నీ మారు పలికాయి. కాని వనాలను అరణ్యాలను దహించివేసే పెను దావాగ్ని ఒకటి ముంజారణ్యంలో పుట్టింది. ఆలమందలన్నిం టినీ చుట్టు ముట్టింది. అది అంతకంతకూ ప్రజ్వరిల్లి ప్రచండ వేగంతో నలుదిక్కులా అల్లుకొన్నది. ఎటు చూచినా పెను మంటలు లేచి ఆకాశం అంటుతున్నాయి. అటు గోవులు, ఇటు గోపాలురు ఆదావాగ్ని మధ్యలో చిక్కుపడి పెద్ద పెట్టున ఆర్తారావాలు చేశారు. శ్రీకృష్ణా! బలభద్రా! మా ప్రాణాలు పోతున్నాయి. ఇక మాకు మీరేదిక్కు మమ్ము కాపాడండి, అంటూ దీనులై మొరపెట్టుకొన్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు వారిని ఊరడించి, ఒక్క క్షణంపాటు వారిని కనులు మూసుకోమని చెప్పి, తాను ఆదావాగ్నిని నోటితో పట్టి మ్రింగాడు. సమస్త గోగోపజనాన్నీ తెచ్చి భాండీరమనే మఱ్ఱితోపులో చేర్చాడు. వారు కళ్ళు తెరిచి చూచి, తామంతా సురక్షితంగా మఱ్ఱివనంలో ఉన్నట్లు తెలుసుకొని మహాశ్చర్య చకితులైనారు. ఇదంతా శ్రీకృష్ణుని యోగమాయ అని అనుకొన్నారు. ఆయన మానవ మాత్రుడు కాదు, సాక్షాత్తు భగవంతుడని భావించారు. ఆ విధంగా

కృష్ణుడు గోగోపగణాలను కాపాడి మునిమాపుననే రాము నితో కలిసి, గోపాలకులు వేధిస్తూ వెంటరాగా వేణుగానం చేస్తూ వ్రేపల్లెకు తిరిగి వెళ్ళాడు. ప్రలంబాసురుడు చావడం దావాగ్ని ప్రకంగటం సవిస్తారంగా విని వ్రేపల్లె వాసులంతా రామకృష్ణుల కొనియాడారు.

ఇట్లా ఉండగా కొంతకాలానికి గ్రీష్మఋతువు గడ చింది. తొలకరి ప్రారంభమైంది. ఉఱుములు - మెఱుపు లతో వర్షాలు కురవసాగాయి. లోకమంతా చల్లబడింది. జనుల హృదయాలు ఉల్లాసంతో పల్లవించాయి. కుంభ పోతగా వానలు, చల్లని ఈదురుగాలి సాగింది. కప్పలు అరు స్తున్నాయి. తూనీగలు ఆడుతున్నాయి. ఈశాన్యదిశన కళ్లు జిగేలుమనేటట్లు మెఱుపులు మెరుస్తున్నాయి. మంటలు, మడుగులు నిండాయి. నదులు, కాల్వలు జలపూరితమై నాయి. ఎక్కడెక్కడి జలాల్లను తమ గర్భాలలోకి చేర్చు కొని సముద్రాలు! తరంగ కల్లోలంతో సంక్షోభించాయి. భూమి అంతా పచ్చపడింది. రామకృష్ణులు, గోగోప గోపికాజనం ఆ వర్షాకాలం యావత్తూ వివిధ వినోద క్రీడల తేలి సుఖించారు. పిదప శరత్కాలం ఆసన్నమైంది. నిర్మలమైన వాయువులు వీచాయి. ఆ ప్రదేశానికి క్రొత్త అందం వచ్చింది. అందని అందచందాలతో చందమామ వెన్నెల వెలుగులు విరజిమ్మాడు. మానవ హృదయాలలో కోర్కెలు మొలకెత్తాయి. గోపికలకు తాపం పుట్టింది. యువతీ యువకుల కాంక్షలు పొంగి ఏకోన్ముఖంగా ప్రవహిం చాయి. ధాత్రి సకల సస్య సంపత్తి ఒసగింది. బృందా

వనంలో కృష్ణుడు గోపకులకూడి, గోవుల మేపుతూ పిల్లన గ్రోవి వాయించడం మొదలుపెట్టాడు. పదునాలుగు భువనాలను మోహంలో ముంచెత్తే ఆ అమృతమధుర వేణుగానం చెవిసోకగానే గోపికల హృదయాలు కృష్ణుడిలో లయించాయి. వనాల్లో వేణుగానం చేస్తున్న కృష్ణుణ్ణి తలుచుకొని గోపెమ్మలు, వియోగభారం భరించలేక తాపంతో కుందారు. తమ పనులన్నీ విడిచి, తమన్ను తాము మరిచి, ఒకరితో ఒకరు శ్రీకృష్ణుని లీలలు చెప్పుకుంటూ మధుర స్వప్నాలలో తేలియాడారు. కృష్ణుడి వేణుగానం విని, ఆయన్ను కని నీలమేఘమని భ్రమించి నెమళ్ళు పురులువిప్పి ఆడాయి, లేళ్ళు లలిత చలిత నేత్రాలతో అట్టే నిలుచుండి ఆ హరిని చూస్తూ ఉండిపోయాయి. ఆవులు చెవులు ఎత్తి ఆ మధుర గానం వింటూ, ఆ మోహనరూపం కంటూ నిలుచుండి పోయాయి. దూడలు పాలు కుడవడంకూడ మానివేశాయి. ఎత్తిన మోరలు ఎత్తినట్లే ఉంచి చూస్తున్నాయి సమస్త జంతుజాలం నిద్రాహారాలు సయితం మాని ఆ అమృతగాన వాహినిలో తేలిపోయింది. పైన పోయే దేవకన్యలు కృష్ణుడి మురళీగానం విని పూల బాణాలతో కొట్టినట్లు, మోహవివశులైనారు.

## గోపికా వస్త్రాపహరణం

తరువాత హేమంతఋతువు ప్రవేశించింది. మార్గశిర మాసం రాగానే గోపికలంతా ఆ నెలరోజులూ కాత్యాయనీ వ్రతం చెయ్యాలని సంకల్పించారు. ప్రొద్దు ప్రొద్దునే లేచి

కాళిందీ నదికి వెళ్ళి జలకాలాడారు. ఇసుకతో అమ్మవారి బొమ్మచేసి దేవపుష్పాలతో పూజించారు. గంధాక్షతలు, ధూపదీప నైవేద్యాదులు ఒసగారు. వివిధోపచారాలతో పూజించి భక్తితో మ్రొక్కారు - అమ్మా! భగవతీ! దేవీ! కాత్యాయనీ! మాకు కృష్ణుడు మగడుకావాలి, అనుగ్రహించవమ్మా. - అంటూ గోపెమ్మలు అమ్మవారికి పలుమార్లు మ్రొక్కుకొన్నారు. ఈ విధంగా ప్రతినిత్యం దేవిని పూజించి ఆ తీర్థప్రసాదాలు స్వీకరిస్తూ, మాసం రోజులు వ్రతం సలుపుతుండగా ఒకనాడు, గోపికలు పేకువజామున నే లేచి యమునానదిలో స్నానాలుచేయ పయనమైనారు - ఓ యమ్మా, ఓసీ, రండమ్మా, రాండే, వేగిరం వెడదాం - అంటూ చెలులంతా ఒకరి నొకరు పేరు పేరున పిలుచుకొని, చెట్టా పట్టాలు పట్టుకొని, విలాసంగా నడుస్తూ, హరికీర్తనలు పాడుతూ కాళిందికి వెళ్లారు. వెళ్లి ఎప్పటిలాగానే చీరెలు విప్పి, గట్టుమీద పెట్టి జలక్రీడ లాడుతున్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు వారి వ్రతం సఫలం చెయ్యాలని నిశ్చయించుకొన్నవాడై స్నేహితుల నెంటపెట్టుకొని అక్కడికి వచ్చాడు. ఒడ్డుననున్న గోపికల చీరలెత్తుకొని - అయ్యో, అయ్యో! అని నవ్వుతున్న చెలికాండ్రతో పరాచకాలాడుతూ, ఆ చెంతనే ఉన్న ఒక చెట్టెక్కి కూర్చొన్నాడు - అమ్మాయిలూ, గోపెమ్మలూ! రండి. రండి - ఇక్కడికి వచ్చి మీ చీరెలెత్తుకపొండి! - తమాషాకాదు సుమా, నిజం, అందరూ కలిసి రండి, లేదా ఒక్కొక్కరే వచ్చి ఎత్తుకపొండి! - అంటూ కొమ్మెక్కి కూచున్నాడు కన్నయ్య. అది చూచి

గోపెమ్మలకు ఎక్కడ లేని మోహం ముంచుకొచ్చింది. ఇదే మంచిమార్గం, ఈ విష్ణుదాసుని - అన్నట్లు ఒకరినంక ఒకరు తెల్లపోయి చూచుకొన్నారు. సిగ్గుతో తలలు వాల్చుకొన్నారు. ముసి ముసి నవ్వులు నవ్వుకొన్నారు. ఇవతలికి రాలేక గొంతుకవరకు నీటిలోనికి వెళ్ళి అట్లాగే నిల్చున్నారు. ఇట్లు చాలాసేపు గడచింది. గోపికలు చన్నీళ్ళలో నానిపోయి, చలికి గడగడ వణకుతూ ఇక ఓర్వలేక ఇట్లా అన్నారు — కృష్ణయ్యా! మమ్ముల నిట్లా చెయ్యడం న్యాయంకాదయ్యా. నీవు యశోదానందుల ముద్దు బిడ్డడవు. గొంటువాడవు! వ్రేపల్లె వాడవాడలా నీ పేరు మారు మ్రోగుతున్నదయ్యా. నీ సంగతి మాకు తెలుసు కాని, ఇక మా చీరెలు మా కిచ్చెయ్యి. చలికి తాళలేకుండా ఉన్నాం. ఓ, మోహన కృష్ణా! మేమంతా నీదాసీలం. నీవు ఏంచెయ్యమన్నా చేస్తామయ్యా. మా కోకలు మా కివ్వవయ్యా గోపాలయ్యా. లేకపోతే నందరాజుతో చెప్పి నీపని పట్టిస్తాం - ఆ మాటలు విని కృష్ణుడు తిరిగి వారితో ఇట్లా పలికాడు - అమ్మాయిలూ! మీరు నిజంగా నా దాసీలయితే, నేను చెప్పినట్లు చెయ్యండి. ఇక్కడికి వచ్చి మీ చీరెలు మీ రెత్తుకపొండి. రారా, చీరెలిచ్చేది లేదు. రాజుతో చెపుతానంటూరా! ఆ ముసలి రాజు నన్నేం చేస్తాడు? - ఇట్లా చెపుతూ కృష్ణుడు మొండిగా, పట్టుపట్టేసరికి — ఇక ఆ గోపెమ్మలు ఏమీ చెయ్యలేక పోయారు. చలికి ఒళ్ళంతా కొంకరులు పోతుంటే తాళలేక చివరకు పాపమా వివస్త్రలైన గోపికలు, రెండు చేతులతో మర్మస్థానం కప్పుకొని మడుగు వెడలి వచ్చారు. వారి భక్తికి

మెచ్చి కృష్ణుడు చెట్టుదిగి వచ్చాడు. వలువలన్నీ బుజాన వేసుకొని ఆ చెలువల చెంతకు వచ్చి - గోపికలారా! ఒక మాట చెపుతాను వినండి! మీరు వ్రతం పట్టారు. వ్రతం పట్టి దిసమొలలతో, స్నానాలు చేశారు. అంచాత దేవుడికి అపచారం చేసినవారైనారు. ఆ పాప పరిహారార్థం తలలు వంచి నాకు మొక్కండి. ఆపై మీ చీరెలు మీరు తీసుకోండి! - అన్నాడు. అప్పుడా గోపకాంతలు కృష్ణునిపై మక్కువతో ఒకచేత మానం కప్పుకొని మరొక చెయ్యెత్తి మొక్కుకొన్నారు. అంతట కొంటె కృష్ణుడు నవ్వుతూ మరల ఇట్లా అన్నాడు - ఒక్కచేత్తో నమస్కరిస్తే దేవుడు మెచ్చడు. ధర్మశాస్త్రం ఒప్పదు. బట్టలు విప్పి బరి వంట స్నానం చెయ్యడం ఒక తప్పు. ఒకచేత్తో మొక్కడం మరొక తప్పు. ఈ రెండు తప్పులకూ శిక్ష ఏమిటీ అంటే రెండు చేతులెత్తి దణ్ణం పెట్టడం - అప్పుడు మీ వస్త్రాలు మీకిస్తాను. లేదా ఈ పాపాలకు ఫలితం అనుభవిస్తారు, - అప్పుడు గోపెమ్మలు వ్రతభంగమగునని తలచి, పాపానికి వెఱచి, భక్తవత్సలుడైన ఆ భగవంతునికి రెండు చేతులెత్తి ప్రణమిల్లారు. అంతట శ్రీకృష్ణుడు ఎంతో సంతోషించి వారి చీరెలు వారికిచ్చివేశాడు. కృష్ణుడిట్లా మోసంచేసి; నానాతిప్పలుపెట్టి సిగ్గుపోయేటట్లు పరిహసించి, పరాభవించినప్పటికీ గోపికలకు ఆయనపై కోపం రాలేదు, చీరెలు కట్టుకొని అందరూ ఆ యశోదానందనునిపై మనస్సు లగ్నంచేసి ఉన్నారు. అప్పుడు కృష్ణుడు వారి మనోరథం ఎరిగి ఇట్లా అన్నాడు - గోపకాంతలారా! మీ కోరిక నాకు తెలుసు. నన్ను పొందగోరి మీరీ

ప్రకారం కలుస్తున్నారు. మీ కోరిక సిద్ధిస్తుంది. మీకు నా పొందు లభిస్తుంది. నాపై చిత్తం నిలిపిన వారికి ఏ పాపాలూ అంటవు. మీరు ఎల్లకాలం నాతో విహరిస్తారు, – ఈ విధంగా కృష్ణుడు చెప్పగా గోపకాంతలు సంతోష స్వాంతలై ఆ ముకుందుని చరణారవిందాలపై చిత్తం నిలిపి తుదకు విడువ లేక విడువ లేక ఆయనను విడిచి వ్రేపల్లెకు వెళ్లారు.

తరువాత రామకృష్ణులు, గోపాలురతోడ అడవులలో ఆలమందలను మేపుకొంటూ చాలా దూరం తిరిగారు. అంతట గొల్లపిల్లలు బాగా అలసిపోయారు. వారందరికీ ఆకలి దహిం చుక పోసాగింది. కృష్ణునివద్దకు వచ్చి ఆకలి తీరేమార్గం ఆలోచించమని అర్థించారు. అన్నాలు లేక ప్రాణాలు అన్నీ పట్టి పోయినవని మొఱపెట్టుకొన్నారు. అప్పుడు కృష్ణుడు వారలకావ నెంచి, అక్కడ అడవిలో తనను భక్తితో పూజి స్తున్న బ్రాహ్మణపత్నుల ననుగ్రహించదలచి ఇట్లా చెప్పాడు– గోపాలకులారా! ఇక్కడికి దాపులో బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులు మోక్షం అపేక్షించి ఆంగీరసం అనే యాగం చేస్తున్నారు. మీరు వెంటనే అక్కడికి వెళ్ళండి. నా పేరు, మా అన్నయ్య పేరు చెప్పండి. మేం పంపామని చెప్పి అన్నం పెట్టమని అడగండి, మీ కోరిక నెరవేరుతుంది; – ఇట్లా చెప్పి వారిని పంపించాడు. వారు తక్షణమే బ్రాహ్మణుల చెంతకు వెళ్ళి సాష్టాంగ దండప్రణామములు ఆచరించి తాము వచ్చిన కార్యం సవిస్తరంగా విన్నవించారు. కాని దీక్షపట్టి యజ్ఞం చేస్తున్న ఆ బ్రాహ్మణులు దీక్షితాన్నం ఒరులకు పెట్టకూడ దనుకొన్నారు. పెడితే తమ యాగఫలం నశిస్తుందని తల

చారు. శ్రీకృష్ణుడు సామాన్య మానవుడని భావించారు. అందుచేత గోపాలకులకు అన్నం పెడతామనీ, లేక పెట్టమనీ - ఏ మాటా చెప్పక, నిర్లక్ష్యం వహించి తమ పనిలో తాము నిమగ్నులైనారు. గోపాలకులు చాలా సేపు కనిపెట్టు కొని ఉండి ఉండి, చివరకు నిరాశచెంది తిరిగి వచ్చారు. జరిగిన విషయమంతా రామకృష్ణులకు విన్నవించారు. అప్పుడు జగన్నాథుడైన శ్రీకృష్ణుడు చిరునవ్వునవ్వి, కార్యార్థి అయిన వాడు ఓర్పుతో కార్యం సాధించుకోవాలని వారికి బోధించాడు. ఈ తడవ బ్రాహ్మణుల భార్యలవద్దకు వెళ్ళి తన పేర్లు చెప్పి అన్నం అడగవలసినదని మళ్ళీ వారిని పంపించాడు. ఆ విధంగానే వారు వెళ్ళి యజ్ఞవాటికలో వాకిళ్ళ ముందు అలంకరించుకొని కూర్చుని ఉన్న బ్రాహ్మణపత్నుల దర్శించి, మ్రొక్కి వచ్చిన పని విన్నవించారు. కృష్ణమహిమ బహు కాలంనుంచి వింటూ, భక్తితో కొలుస్తున్నవారు కావున ఆ విప్రాంగనలు రామకృష్ణులరాక విని సంతోష సాగరంలో తేలి ఆడారు. వెంటనే వంటశాలలోకి వెళ్ళారు. భక్ష్యభోజ్య చోష్య లేహ్యములతో కూడుకొన్న మధురాన్నం పాత్రల నిండా నింపుకొన్నారు - అయ్యో, యజ్ఞం చెడుతున్నదని తండ్రులు, కొడుకులు, భర్తలు, అన్నదమ్ములు - ఎవరెంత మొత్తుకున్నా వినక, ఎంత వారించినా నిలువక, అన్నపు పాత్రలు తీసుకొని కృష్ణభగవానుడి చెంతకు పయనమైనారు. పయనమై వెళ్ళి యమునాతటిన వనంలో బలరామసహితుడై, గోపపరివృతుడై, ఆలమందలు మేపుతున్న నీలమేఘశ్యాముని, నిఖిల జగదాధారుని, నెమలిపింఛపు వాసిని, వేణుగాన

లోలుని పీతాంబరధారుని, – శ్రీకృష్ణుని కాంచారు. కాంచి తన్మయులైనారు. ఇట్లా సర్వమును త్యజించి తన్ను దర్శింప వచ్చిన విప్రకాంతలను కృష్ణుడు ఆదరంతో కనికరించి అనుగ్రహించాడు. కాని పాపం ఆ అబలలు తాము అందరినీ ధిక్కరించి వచ్చామని ఆశ్రమానికి పోతే తమ పతులు ఆదరిస్తారనే ఆశ లేని మొఖం పెట్టుకున్నారు. అప్పుడు కృష్ణుడు అలాంటిదేమీ జరగదని, వారికి పుణ్యలోకాలు లభిస్తాయని చెప్పి తిరిగి ఆశ్రమానికి వెళ్ళవలసినదని వారిని హెచ్చరించాడు. అంతట వారు భగవంతునికి అన్నపాత్రలు సమర్పించి పలువిధాల పూజించి మరల యజ్ఞశాలకు వెళ్ళారు. వారి భర్తలు వారిని వల్లెత్తుమాట అనక ఆదరించి యజ్ఞం సమాప్తి కావించారు. ఒకామెను మాత్రం భర్త కోపించగా ఆమె తక్షణమే చిత్తం పరమేశ్వరాయత్తంచేసి యోగ మహిమతో దేహం పరిత్యజించి భగవంతునిలో ఐక్యమైంది. యాగం పూర్తి అయిన పిదప తమకు కృష్ణదర్శన ప్రాప్తి లేనందుకు బ్రాహ్మణోత్తములు మిగుల చింతించారు. ఆయనను అవివేకంతో ధిక్కరించినందుకు పశ్చాత్తప్తులైనారు. తమ అపరాధం మన్నించమని ఆ మాధవుని అనవరతం వేడుకొంటూ గడిపారు.

ఇక అక్కడ వ్రేపల్లెలో కథ — గోపకులంతా ఏటేటా ఇంద్రయాగం చేస్తుండేవారు. వానలు బాగా కురిపించి, పంటలు పుష్కలంగా పండించి, దేశం సుభిక్షం చెయ్యమని మేఘాధిపతి అయిన ఇంద్రదేవుణ్ణి ప్రార్థిస్తూ ఈ యాగం చేసేవారు. మళ్లీ ఈ ఏడు కూడా గోపకులు యాగం

చెయ్య సమకట్టారు. కాని జగన్నాథుడైన శ్రీకృష్ణుడు అందుకు అడ్డు చెప్పాడు. తండ్రి అయిన నందరాజువద్దకు వెళ్ళి ఇంద్రయాగంవల్ల ఫలితం లేదనీ, దానిని ఆపవలసిందనీ చెప్పాడు. అంతట నందాది గోపకులంతా ఇట్లా చేస్తే ఇంద్ర దేవుడు ఆగ్రహిస్తాడనీ, దేశంలో క్షామం వస్తుందనీ బదులు చెప్పారు. కాని సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు ఇంద్రుడికి కోపం తెప్పించి చూద్దామనుకున్నాడు - తిరిగి వారితో ఇట్లా అన్నాడు; - సర్వజగత్తుకూ ఆధారమైనవాడు సర్వేశ్వరుడు. ఆయన కర్మ సాక్షి. ప్రతి ఒక్కరూ ఆ కర్మకు బద్ధులు కావలసిందే - ఎవరికర్మ ఎట్లా ఉన్నదో అట్లా జరుగుతుంది. ఇంద్రుడుకూడా ఆ కర్మను అనుసరించవలసిందే - అందుచేత ఇంద్రుణ్ణి ప్రత్యేకంగా మనం పూజించవలసిన పని లేదు. అతనేమీ భగవంతుడు కాదు. పైగా మనకీయాగంతో ఎంతమాత్రం పని లేదు. మనం వనవాసులం. అడవులలో, కొండలలో నివసించేవారం. గోవులను కాచేవారం. కనుక ఈ కొండలను, గోవులను, బ్రాహ్మణులను పూజించడం మనకర్తవ్యం. ఇకనైనా ఆ ఇంద్రుణ్ణి పూజించడం మాని ఇంద్రయాగార్థం సంతరించిన వస్తు సంభారాలు, ద్రవ్యాలుపెట్టి గోబ్రాహ్మణ పర్వతపూజ చెయ్యండి బ్రహ్మవిదులైన బ్రాహ్మణులచే హోమాలు చేయించండి వారికి మృష్టాన్న భోజనాలుపెట్టి గోవులను దక్షిణ ఇవ్వండి. కావలసినంత మేత మేతపెట్టి గోగణాన్ని కొలవండి. మన ఈ గోవర్ధన పర్వతాన్ని పూజించి బలులు సమర్పించండి. భక్తితో ఈ గిరికి ప్రదక్షిణం చేస్తే సకల ఫలితములూ సిద్ధిస్తాయి, - ఇట్లా చెప్పి ఆ శ్రీమన్నారాయణుడు

ఇంద్రుడి కంటె అంతగ గొప్పవాడైనని సంకల్పించారు. నందాది గోపకులంతా శ్రీకృష్ణుడు చెప్పిన సలహా సంతోషంతో అంగీకరించారు. ఇంద్రయాగం మాని ఆద్రవ్యంతో గోబ్రాహ్మణ పూజలు ఆచరించారు. గోవర్ధనగిరికి పుష్కలంగా బలులు ఒసగారు. గోపాలకులకు విశ్వాసం కలిగించేటందుకు కృష్ణుడు మహాపర్వత రూపం ధరించి తాను కొండదయ్యాన్నని చెపుతూ ఆ బలుల నన్నింటినీ తిన్నాడు. పిమ్మట గోపకులు, గోపికలు కొత్తవస్త్రాలు కట్టుకొని; కొత్తసొమ్ములు పెట్టుకొని సమస్తవస్తు సంభారాలతో, శకటములు అధిరోహించి మంగళ వాయిద్యాలు మ్రోగుతుండగా గోవర్ధనగిరికి ప్రదక్షిణం కావించారు. అంతట శ్రీకృష్ణుడు పలువిధాలుగా ప్రస్తుతిస్తూ గిరిరాజుకు ప్రణమిల్లాడు. తరువాత గోపాలకులు, గోపికలు గిరికి భక్తితో మ్రొక్కారు. ఈ విధంగా గోవర్ధనోత్సవం జయప్రదంగా ముగించి తిరిగి అందరూ బృందావనం చేరుకొన్నారు.

## గోవర్ధనోద్ధరణ.

ఇక్కడ ఇట్లా ఉండగా, అక్కడ దేవలోకంలో దేవేంద్రుడికి ఆగ్రహం వచ్చింది. నందాది గోపకులు తనకు ఏటేటా చేసే యాగం చెయ్యడం మానుకున్నందుకు మహోగ్రుడై మండిపడ్డాడు. దీనికంతకూ కారణం కృష్ణుడే అని తెలుసుకొన్నాడు. సకల లోకాలూ ఏలేవాణ్ణి నేనుండగా, మధ్య ఆ శ్రీకృష్ణుడేమిటి? ఏమిటా పొగరు? ఈ గొల్లవాళ్ళను ప్రేల్లైను ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువుల నీళ్లు తాగి

స్తాను – అని కంఠకాఠవరంతో హుంకరించాడు. దేవేంద్రుడు వెంటనే ప్రళయకాలంలో లోకాలను అంతం కావించే సంవర్తక మేఘాలను పిలిచాడు – ఓరీ! సంవర్తక మేఘుడా! విన్నావ్రుటా ఈ వింత! గొల్లవాళ్ళు క్రొవ్వెక్కి నన్ను అవమానించారు. ఎవడో సామాన్యమానవుడైన ఆ కృష్ణుణ్ణి అండగా చేసుకొని, నన్నూ నాలోకాన్నీ మరచిపోయారురా! నాకు యాగం చెయ్యడం మానుకొన్నారురా! చూచావ్రుటా! నన్నే ధిక్కరిస్తారా? ఇక నూడు వాళ్ళను ఏం చేస్తానో! ఓరేయ్, మేఘుడా! నీకు ఆజ్ఞ ఇస్తున్నాను. తక్షణం వ్రేపల్లె వెళ్ళు. నీవూ నీ అనుచరులూ ఆ గొల్లపల్లెపై విరుచుకపడండి. మీ ప్రతాపం చూపండి. ఆ దుష్టులను నామరూపాలు లేకుండా నాశనం చెయ్యండి. ఈ లోపల నేను అసురకోటి కొలుస్తుండగా ఐరావతం ఎక్కి అక్కడికి వస్తాను పొండి – అంటూ దేవేంద్రుడు మేఘాలకట్లు విప్పి వదలిపెట్టాడు. అంతట ఆ మేఘాలు ప్రళయరూపం తాల్చాయి. లోకాలు అల్లకల్లోలమైనాయి. బ్రహ్మాండంగా ఉరుములు, మెరుపులు, పిడుగులుపడుతూ వ్రేపల్లెపై భయంకరమైన రాళ్ళవాన కురవడం మొదలుపెట్టింది. ఇప్పుడా మేఘాలను పట్టపగ్గాలు లేవు ఆ భయదజలద గర్జనలకు భూమ్యాకాశాలు గిర్రున తిరగాయి. ఆకాశం చిల్లులు పడ్డట్లు – గోకులంపై కుంభవర్షం కురిసింది. ఏనుగుతొండం అంతధారగా ఎడతెరపి లేనివాన! మింటికి – మంటికి ఏకధారగా వాన! కుంటలు, కూపాలు ఏకమైనాయి. దరులు తెగి చెరువులు ప్రవహించాయి. ఎక్కడ చూచినా జల

మయం. అంగుళం చోటు కూడా పొడినేల అగుపించడంలేదు. గోకులంలో గోపాలకులు, పిల్లలు, తల్లులు అలమటించి పోయారు. జడివాన, గాలి. ఆవులు అంబా అని అరిచాయి. దూడలు తల్లుల గర్భంలో తలలుదూర్చి ఒడలు ముడుచుకొన్నాయి. తుదకు సకల గోగోప గోపీజనం ఆ గోవిందుని శరణుజొచ్చింది - ఓ కృష్ణా! ఇంద్రుడు మాపై కోపించాడు. రాళ్ళవాన కురిపిస్తున్నాడు. ఇక మాకు నీవే శరణ్యం కరుణించి గోకులాన్ని కాపాడవయ్యా కృష్ణయ్యా - అంటూ గోపాలకులు ప్రార్థించారు. అప్పుడు కృష్ణుడు ఇంద్రుడికి గర్వ భంగంచేసి భక్తుల కాపాడ నిశ్చయించాడు. ఇట్లా నిశ్చయించినవాడై భగవంతుడైన శ్రీకృష్ణుడు, పుట్టగొడుగును ఎత్తినట్లు, ఒక్క చేతి చిటికెన వ్రేలితో గోవర్ధన పర్వతం ఎత్తి పట్టుకొన్నాడు - ఓ అమ్మా! ఓ నాయనా! ఓ వ్రేపల్లె వాసులారా! ఇక మీకే భయమూ లేదు. గోవులతో సహా వచ్చి ఈ గోవర్ధన పర్వతంక్రింద సుఖంగా ఉండండి. ఈ పర్వతాన్ని నేనిట్లాగే పట్టుకొని ఉంటాను. ఇక వాన, గాలి మీ దగ్గరికి రాదు, - అని పలికాడు. అప్పుడు గోకులమంతా ఆ గోవర్ధనగిరిక్రింద సుఖంగా ఉన్నది. ఆ విధంగా ఏడురోజులు రాత్రింబగళ్ళు జడివాన కురిపించాడు దేవేంద్రుడు. కాని కృష్ణభగవానుడు ఇంచుకయు చలించలేదు. ఎత్తిన కొండ ఎత్తినట్లే ఆ ఏడునాళ్ళూ ఎత్తిపట్టుకొని కాలు అయినా కదపకుండా నిలుచుండిపోయాడు. అంతట ఇంద్రుడికి గుండెలు తారెత్తాయి. అతని గర్వాంధకారం కరిగిపోయింది. అహంకారం అవివేకం అంతరించాయి. కృష్ణ మహిమకు ఆశ్చర్య

చకితుడైనాడు. ఇక లాభం లేదని మేఘాలను మళ్ళించాడు. వాన వెలిసింది. మబ్బులు విడిపోయాయి. ఎండపొడ వచ్చింది. అంతట శ్రీకృష్ణుని ఆజ్ఞానుసారం గోపాలకులంతా గోవులను, స్త్రీలను, పసిబాలురను తోడ్కొని కొండక్రిందినుంచి ఇవతలికి వచ్చి, తిరిగి వ్రేపల్లెకెళ్ళి సుఖంగా ఉన్నారు. కృష్ణుడు ఆ గోవర్ధనగిరిని మరల ఎప్పటి స్థానంలో నిలిపి బలరామ సహితుడై ఇంటికి మరలాడు. గోవర్ధనగిరి ఎత్తి గోకులమును కాపాడిన గోపాలకృష్ణుణ్ణి అందరూ పలుతెఱగుల ప్రశంసించి పూజించారు. ఆయన మహిమలు కథలు కథలుగా చెప్పుకొని ఆనందపరవశులైనారు. యశోదానందులు భగవంతుణ్ణి కుమారునిగా బడసినందుకు ఎంతో సంతసించి రామకృష్ణుల కౌగలించుకొని, మృష్టాన్న భోజనములిడి సంతృప్తి పరచారు. వ్రేపల్లెవాడంతా ఇంతటి అద్భుతం ఎన్నడూ కని విని ఎరుగమని కృష్ణుణ్ణి వేనోళ్ళ కీర్తించింది. తరువాత దేవేంద్రుడు కామధేనువును వెంటబెట్టుకొని వచ్చి కృష్ణుణ్ణి దర్శించాడు. తన అపరాధం సైరించమని మ్రొక్కుకొన్నాడు. లోకాలను తానే పాలిస్తున్నానన్న అహంకారం ఉడిగి, ఇంద్రుడు సర్వేశ్వరుడు, జగన్నాథుడు అయిన కృష్ణపరమాత్మను వేదవాక్కులతో నుతించి, శరణువేడాడు. అంతట పరమాత్మ కరుణించి, అహంకారంతో ప్రవర్తించవద్దని హెచ్చరించాడు. తరువాత కామధేనువు శ్రీకృష్ణుని స్తుతించింది – కృష్ణా! లోకేశ్వరా! నీవు భూభారం బాప అవతరించిన భగవంతుడవు. ఇక నీవే మాకు నాథుడవు. ఇక నీవె ఇంద్రపదవి స్వీకరించవలసినది. నిన్ను ఇంద్రునిగా అభిషేకిస్తాము – అని

కామధేనువు విన్నవించగా కృష్ణుడందులకు అంగీకరించాడు. తరువాత కామధేనువు గంగాజల మిశ్రమమైన తన దివ్య క్షీర ధారలతోను, దేవేంద్రుడు తన ఐరావతం తొండంతో మందాకినీ జలం చల్లుతూను, సకల దేవ, మునిగణములు కొలుస్తుండగాను శ్రీకృష్ణుణ్ణి అభిషేకించారు. అప్పుడు ఇంద్రుడు కృష్ణునికి గోవిందుడని పేరు పెట్టాడు. గరుడగంధర్వ కిన్నర కింపురుష విద్యాధర సిద్ధ చారణులంతా హరిని కీర్తించారు. తుంబురు నారదులు హరికీర్తులు గానం చేశారు. పైనుండి పూలవానలు కురిశాయి. ముల్లోకాలు సుఖించాయి ఇట్లా గోపాలకృష్ణుణ్ణి గో గోకులపతిగా అభిషేకించి దేవేంద్రుడు తన పరివారంతో తిరిగి తన లోకానికి వెళ్ళిపోయాడు.

ఇట్లా ఉండగా ఒకనాడు ఏకాదశి తిథి వచ్చింది. కృష్ణుని తండ్రి అయిన నందుడు ఏకాదశినాడు ఉపవాసం ఉన్నాడు. ద్వాదశినాడు ఉదయాన్నే పారణచేసి ఏకాదశీ వ్రతఫలం దక్కించుకోవాలని సంకల్పించాడు. ద్వాదశి పారణ త్వరగా ముగించుకోవాలన్న తొందరలో సూర్యోదయం కాకమునుపే, అసురవేళ అని తెలియక స్నానం చెయ్యడానికి గబగబ యమునానదికి వెళ్ళాడు. నదిలో దిగి స్నానం చేస్తుండగా అసురు డొకడు నందుణ్ణి పట్టుకొని వరుణ లోకానికి తీసుకపోయాడు. అంతట గోపికలు నందునికానక దుఃఖిస్తూ కృష్ణునివద్దకి వెళ్ళి మొర పెట్టుకొన్నారు. కృష్ణుడు జరిగిన విషయం తెలుసుకొని వారిని ఊరడించి, తండ్రిని తీసుక రావడానికి వరుణ లోకానికి వెళ్ళాడు. అఖిలలోక

పాలకుడైన శ్రీకృష్ణుని కాంచి వరుణదేవుడు సపరివారంగా ఎదురు వచ్చి, పూజించి సకల మర్యాదలు చేశాడు. జగన్నాథా! నా తప్పు మన్నించండి. నా సేవకుడు అవివేకంతో నీ మహిమ తెలియక నీ తండ్రిని పట్టి తెచ్చాడు. ఇదుగో, నీ తండ్రి నందుడు. సురక్షితంగా ఉన్నాడు. పరమేశ్వరా! మేమంతా నీ దాసులం. మా తప్పు మన్నించి నీ తండ్రిని తిరిగి తీసుకవెళ్ళ వలసినది- అంటూ వరుణదేవుడు శ్రీకృష్ణుని వేడుకొని నందుని తెచ్చి అప్పగించాడు. గోవిందుడు వరుణుని అనుగ్రహించి తండ్రిని తీసుకొని తిరిగి వ్రేపల్లెకు వచ్చాడు. యశోద మొదలైన గోపికలు సకల గోపాలకులు నందుని చూచి ముదమందారు. శ్రీకృష్ణుని మహిమలు కొనియాడి, ఆయన సాక్షాత్తు శ్రీమన్నారాయణుడని భావించి ఎల్ల వేళల భక్తితో కొలుస్తూ వచ్చారు. నందుడు తాను చూచి వచ్చిన వరుణలోకంలో విశేషాలు వ్రేపల్లెవాసులకు ఎరుకపరిచి అక్కడ వరుణదేవుడు శ్రీకృష్ణుణ్ణి ఎంత భక్తితో పూజించి, కొలిచినదీ చెప్పాడు. అది విని గోకులవాసులు తమ కటువంటి పుణ్యలోకదర్శనం ప్రాప్తి లేకపోయెనని చింతించారు. వారి మనోరథం సంకల్పించి గోవిందుడు యమునానదిలోనే వారికి బ్రహ్మలోకం చూపించాడు. వారు బ్రహ్మానందభరితులై కృష్ణుని వేనోళ్ళ పొగడారు.

తరువాత బృందావనంలో ఉన్న శ్రీకృష్ణుడికి పూర్వం తాను గోపికలకు చేసిన బాస గుర్తుకొచ్చింది. ఆ బాస తప్పకుండా, వారి మనోవాంఛ సఫలం చెయ్యాలనుకున్నాడు.

ఆ యమునాతీరంలో పుష్పపూలవలె శరత్కాలపు వెన్నెల విచ్చి కాస్తున్నది. ఎంతటివారినీ మోహంలో ముంచివేస్తున్నది. ఆ వెన్నెల రాత్రుల్లో గోపికలతో క్రీడించాలని కృష్ణుడికి మనసు పుట్టింది. యమునానదీతీరం వెన్నెల అంతటా మడుగులుకట్టి కన్నుల పండువగా కనుపిస్తున్నది. లోకమంతా వెండి కరగిపోసినట్లున్నది. ఆ యమునాతటిలో కూర్చొని శ్రీకృష్ణుడు గోపికలనుకాంక్షించి మురళి వాయించాడు. ఆ పల్లవి మెల్లని రాగాల పిలుపు అనురాగాల తలపు వ్రేపల్లెలో గోపెమ్మల చెవిని పడ్డది. సడడమే తరవాయి, ఆ స్త్రీలందరి శరీరాలు పూలబాణం తాకినట్లనిపించి పులకరించాయి. వారంతా ఒకరి నొకరు పిలుచుకోలేదు, ఒకరి కొకరు తలుచుకోలేదు. రహస్యం; ఒకరికి కనుపించకుండా ఒకరు కృష్ణుడి దగ్గరికి పయనమైనారు. ఎవరికీ మనస్సు మనస్సులో లేదు. ఏదో శృంగారపు పొంగులో కొట్టుకపోయారు. కొందరు గోపెమ్మలు తినే తినే అన్నం వదిలి వెళ్లారు. కొందరు పొయ్యిమీద ఉడుకుతున్న అన్నం దించకుండానే వెళ్ళారు. పొయ్యిమీద పాలు పొంగుతున్నా చూడక వెళ్ళారు కొందరు. భర్తలకు పరిచర్యలు చేస్తూ చేస్తూ గబాలున పరుగుతీశారు కొందరు. మరిదికి అన్నం వడ్డిస్తూ వడ్డిస్తూ పరుగెత్తింది ఒక మగువ. అత్తగారికి పక్క వేస్తూ పారిపోయింది ఒక గొల్ల పడుచు. పిల్లకు పాలిస్తూ చివాలున లేచి వెళ్ళింది ఒక చిన్నది. కట్టుకునే చీర అల్లాగే సగం వదిలేసి పరుగుతీసింది ఒక గోపకాంత. బొట్టూ-కాటుక పెట్టుకుంటూ పూర్తికాకుండానే వెళ్ళింది ఒక

గోపాంగన. తొడిగినే రవిక అలాగే పెట్టుకొని ఉరుకు తీసింది ఒక గొల్లపిల్ల. గంధం పూసుకుంటూ అలాగే పరుగెత్తింది ఒక గోపెమ్మ. పెట్టుకుంటున్న పూలు అక్కడే పెట్టేసి వెళ్ళింది ఒక గోప వధువు. తల దువ్వుతూ దువ్వుతూ పరుగుతీసింది ఒక పడుచు. భర్తలు, బావలు, మరదులు, అన్నలు, తమ్ములు, అత్తలు, మామలు- ఏమిటంటే పలకరు; ఎక్కడికంటే చెప్పరు; వద్దంటే వినరు, ఆగమంటే ఆగరు! ఈ విధంగా గోపికలు గోపాల కృష్ణునిపై మరులుగొని యమునాతీరానికి పరుగుతీశారు. ఇళ్ళల్లో చిక్కుకొన్న కొందరు సుందరులుమాత్రం ఇవతలికి రాలేక కృష్ణుడిపై చిత్తం లగ్నంచేసి, మోహంలో మునిగిపోయి, విరహ తాపంతో కుంది, ఆయనను కౌగలించుకొన్నట్లు తీయటి కలలు కని, ఆ కలలోనే పాంచభౌతిక కాయాన్ని త్యజించారు.

ఇట్లా గోపకాంతలంతా తన చెంతకు రాగా కృష్ణుడు వారిని ఆదరంతో పలకరించాడు. యోగక్షేమాలు విచారించాడు. కమ్మని కబుర్లు చెప్పి తృప్తి పరచాడు. తరువాత ఓ, గోపకాంతలారా! మీరు నాపై మక్కువ కలిగివచ్చారు. సంతోషించాను. కాని ఈ అపరాత్రివేళ స్త్రీలు - అందులోనూ ఇల్లాండ్రు, ఇట్లా ఇళ్ళూ వాకిళ్ళూ విడిచి, భర్తలను, బంధువులను, పిల్లలను తల్లులను నిరాకరించి ఒంటిగా వనానికి రావడం భావ్యమేనా? మీ పిల్లలు ఏడుస్తుంటారు. మీ భర్తలు కోపగిస్తుంటారు. మీ బంధువులు మీకోసం వెదుకు తుంటారు. కనుక నామాట విని మరల మీ మీ ఇళ్ళకు వెళ్ళండి. ఈ వనంలో క్రూర మృగా లుంటాయిసుమా!

ఆడవారు సంచరించదగిన చోటుకాదు ఇది, – అంటూ వారిని తిరిగి పంపించడానికి ప్రయత్నించాడు. ఆ పలుకులు విని గోపికల గుండెలు తల్లడిల్లాయి. వదనాలు వాడాయి. కనుల నీళ్ళు క్రమ్మాయి. నిశ్చేష్టలై నిలబడ్డారు. ఎవరికీ నోట మాట పెగిలి రాలేదు. చివరికి కన్నీళ్లు పమిట కొంగులతో తుడుచుకొన్నారు, – నాథా! జగన్నాథా! మమ్మల్నిట్లా బాధిస్తావయ్యా. విరహతాపంతో వేగలేకుండా ఉన్నాం కృష్ణయ్యా. మా పంచప్రాణాలు నీపైనే పెట్టుకొన్నాం. మమ్మల్నిట్లా నిరాకరిస్తావా? నీవు లేని జీవితం మాకెందుకూ? నీవు లేకపోతే మాకు కాళ్ళు – చేతులు ఆడవు! మదనాగ్ని మమ్మల్ని కాలుస్తున్నది. మా కోర్కె తీర్చవయ్యా గోపాలయ్యా. ఓ ఆపద్బాంధవా! ముల్లోకాలను మోహింపచేసే నీ రూపం మమ్మల్ని కట్టివేసింది. ఈ తాపానికి తాళలేకుండా ఉన్నామయ్యా. మేము నీవారం. మా సర్వాంగాలు నీవి – మా అందమంతా నీది, మా చందమంతా నీది; మా మనస్సు నీది, మా వయస్సు నీది. మేము నీ శరణదాసీజనం. మావంక ఒక్కమాటు కన్నెత్తి చూడు. మా స్తనాలపై ఒక్కతడవ చెయ్యిపెట్టి చూడు, వెచ్చగా ఎట్లా వేగిపోతున్నాయో! నీ బాహువులతో ఒక్కతూరి కౌగలించుకొని మా తాపం చల్లార్చు కృష్ణా; – అంటూ దీనవదనలై ప్రార్థించారు. అంతట మురళీ కృష్ణుడు గోపికల మోహం తీర్చ సంకల్పించాడు. వారిని తన కౌగిట్లోకి తీసుకొన్నాడు. కొందరు పడతుల చెక్కిళ్లు నొక్కాడు, కొందరిని పొడలు తడిమి చూచాడు. కొందరి చేతులు స్పృశించాడు.

కొందరి ముసుగులు సవరించాడు. కొందరితో పక పక నవ్వుతూ పరాచకా లాడాడు. ఇట్లా ఆ గొల్లపడుచులకూడి కృష్ణుడు యమునానది సైకత స్థలాలలో, పిండారబోసినట్లున్న ఆ పండు వెన్నెల్లో విలాసక్రీడల తేలుతూ స్వేచ్ఛగా విహరించ సాగాడు. కృష్ణునితో రమిస్తుంటే గోపకాంతలకు అంతకంతకూ మదనాగ్ని ప్రజ్వరిల్లుతూ వచ్చింది. కృష్ణుడు తనకు కావా లంటే తనకు కావాలని, తన దగ్గరికి రావాలంటే తన దగ్గరికి రావాలని గోపికలు పోటాపోటీలు పడ్డారు. కృష్ణు డిట్లా కొంతసేపు వారిని కవ్వించి, నవ్వించి, మురిపించి, మనవించి ఉన్నట్టే ఉండి మాయమైనాడు. వారిని పరీక్షించాలని చేసిన పని ఇది. కృష్ణుడు ఉన్నట్టే ఉండి కనుపించక పోయ్యేటప్పటికి గోపికలు విరహతాపానికి తాళలేక – కృష్ణా, కృష్ణా! ఎక్క డున్నావు, ఎందుపోయావు?, – అంటూ సలవరిస్తూ వెర్రెత్తి నట్లు తిరుగనాగారు. వనాలన్నీ వెదికారు. పొదలన్నీ గాలిం చారు. ఇసుకతిన్నెలు ఎక్కి చూచారు. కనుపించిన చెట్టు నల్లా పుట్టనల్లా, పువ్వునల్లా, తీగెనల్లా, పేరు పేరున పిలిచి కృష్ణుణ్ణి చూచారా అని అడిగారు. లేళ్ళను నిలిపి కృష్ణుని జాడ తెల్పమని ప్రశ్నించారు. ఇట్లా తిరిగి తిరిగి ఎంతకూ యశోదనందనుని జాడ యెరుగక గోపికలు విహ్వలచిత్తలై శ్రీకృష్ణుని బాల్యక్రీడలు అభినయించడం మొదలుపెట్టారు. ఒక గోపిక కృష్ణుడివేషం కట్టింది. ఒక గొల్లపడుచు పూతన అయి, ఆమెకు పాలిచ్చింది. ఈ విధంగా శకటాసురవధ, ధేను కాసుర సంహారం, బకాసురవధ మొదలయిన కృష్ణుని బాల్య క్రీడలన్నీ అభినయించారు. కొందరు ఆవులుగా అభినయిం

చారు. ఒక గోపెమ్మ కృష్ణుడుగా నటించి మురళి వాయించింది. తక్కినవారు కృష్ణవేషం కట్టిన గోపెమ్మతో విరహ వేదన అభినయించారు. ఇట్లా కృష్ణక్రీడలు ఆడి, కృష్ణలీలలు పాడి వారంతా అలసి, సొలసి యమునాతీరానికి వెళ్ళారు. అంతా కలసి ఆ లీలామానుష విగ్రహుని రమ్మని ప్రార్థిస్తూ గీతగానం చేశారు. ఆ గానంలో మధురానురాగం పొర్లి ప్రవహించింది. ముల్లోకాలూ మోహంలో మునిగిపోయాయి. అంతట కృష్ణుడు కరుణించి, విరహతాపంలో మగ్గుతున్న గోపెమ్మలకు జగన్మోహనాకారంతో దర్శనమిచ్చాడు. కృష్ణుడు కనుపించేటప్పటికి గోపికలకు పోయిన ప్రాణాలు లేచి వచ్చాయి. మగువలంతా మాధవునిపై పూలు రాలినట్లు రాలి వాలిపోయారు. ఒక కాంత కృష్ణుడి కరములు పట్టింది. ఒకపడుచు తొడపై ఎక్కింది. ఒకామె ఒడలు ఒత్తింది. ఒక చెలువ కృష్ణుడి చరణములు ఎత్తి నెచ్చెలి తన స్తనములపై పెట్టుకొని వేదన చల్లార్చుకొన్నది. ఒక అలివేణి అలిగి కృష్ణుడి వంక చురచుర చూచింది. ఒక ఇందీవరాక్షి కృష్ణుడి కళ్ళలో కళ్ళుపెట్టి స్వర్గానందంలో తేలిపోయింది. ఒక మగువ పమిట తీసి పక్క పరిచింది. ఒక కోమలి కొంగుతో విసరింది. ఈ విధంగా శ్రీకృష్ణుడు గోపికలమధ్య తారలమధ్య ఉన్న చంద్రుడిలాగా వెలుగొందాడు. కొంతసేపు ఆ గొల్లపడుచులు — కృష్ణా ఇది నీకు తగునా? విరహతాపంలో వేగిపోతున్న మమ్మలను ఇట్లా మోసగిస్తావా? నాథా, నా గుండెపై చెవిపెట్టి వినండి, కృష్ణా, కృష్ణా అని ఎట్లా కలవరిస్తున్నదో! స్వామీ! నావలపంతా నీకోసం దాచు

కున్నాను స్వామీ! ప్రియా! నా మనస్సు, వయస్సు నీకు మీద కట్టుకొన్నానయ్యా! – అంటూ పలుకేతుల ప్రశం సిస్తూ, మధ్య మధ్య నిష్టూరాలు పలుకుతూ గడిపారు. తరువాత కృష్ణుడు వారిని ఓదార్చి, అనుగ్రహించాడు.

## రాసక్రీడలు

అంతట గోపాలుడు గోపకాంతలతో రాసక్రీడలు ప్రారంభించాడు. గోపెమ్మలంతా గుండ్రంగా నిలుచున్నారు. కృష్ణుడు విచిత్రమూర్తి అయి పలురూపాలతో పొడగట్టాడు. పలువురు కృష్ణులుగా కనుపించి ఇద్దరిద్దరు గోపికలమధ్య తానొక్కొక్కడుగా నిలుచున్నాడు. ఏమిటా మహిమ ? — అంతమంది గోపికలకూ అంతమంది కృష్ణులు. ఎవరికివారు ఆయన తమవాడనుకుంటున్నారు. ఆవలయంలో మధ్య నిలుచున్న కృష్ణుడు మురళి వాయిస్తున్నాడు. ఇరువైపులా గోప రమణులు నృత్యం చేస్తున్నారు. కృష్ణుడు వారి మెడచుట్టూ చేతులు పెనవేసి, ఆడుతున్నాడు. కృష్ణుడు, గోపికలు కోలాటం వేశారు. కృష్ణుడు గోపికలు గిన్నె గిరగిర తిరిగారు. సకల కళామూర్తి అయిన ఆ భగవంతుడు డీవిఘంగా హస్తపాద విన్యాసంతో రాసం కావించాడు. రాసక్రీడా మహోత్సవం రమణీయంగా సాగుతుంటే సకల దేవతలూ దివినుండి విలకించారు. తన్మయులై భగవంతుని కీర్తించారు. ఇట్లా రాసక్రీడ లాడి రాసలీలలు పాడి తుదకు అలసి సొమ్మసిల్లారు. గోపెమ్మలు. గోవిందుడు రాసక్రీడ చాలించి వారి అలసట తీర్చాలని సంకల్పించాడు.

## జలక్రీడలు

గోపికలను వెంటబెట్టుకొని జలక్రీడలాడ యమునానదికి వెళ్లాడు గోవిందుడు. అందరూ యమునలో దిగారు. కృష్ణుడు తన ప్రియురాండ్రపై నీళ్ళు చల్లాడు. వాళ్ళు కూడా ఆ మోహనమూర్తిపై జలధారలు చిలకరించి ఆనందించారు. ఈ విధంగా ఆడ ఏనుగులతో కూడిన మగ ఏనుగులాగా శ్రీకృష్ణుడు యమునానదిలో ఆ కన్నెలచేయి చాత్రాసేస్తు జలక్రీడలాడుతూ విహరించాడు.

## గంధర్వ శాపవిమోచనం

తరువాత ఒకనాడు నందాది గోపకులంతా దేవయాత్ర సలుపవలెనని కుతూహలపడి, అశ్వములు పూన్చిన రథములపై ఎక్కి సపరివారంగా అంబికావనానికి బయలుదేరారు. అక్కడ సరస్వతీనదిలో స్నానాలుచేశారు. పార్వతీ పరమేశ్వరుల పూజించి అమ్మవారికి పెద్ద జాతరచేశారు. బలులు పెట్టారు. బ్రాహ్మణులకు గోభూ హిరణ్య వస్త్రాన్న దానాలు ఒసగారు. తాము పచ్చిగంగ మాత్రం పుచ్చుకొని ఉపవాసం ఉన్నారు. ఇట్లా ఉండగా ఆ రాత్రి అందరూ నిద్రిస్తున్న సమయాన అక్కడ అడవిలోనుంచి ఒక పెద్ద సర్పం వచ్చింది. నిద్రిస్తున్న నందరాజును కఱచి, మింగిబోయింది. అప్పుడు కృష్ణా, కృష్ణా, రక్షించు, రక్షించు – అంటూ ఎలుగెత్తి అరిచాడు. గోపకులంతా మేల్కొన్నారు. కొఱవులు ముట్టించి తెచ్చి పాముకు అంటించారు. అయినా ఆపెను

సర్పం నందుణ్ణి పట్టుకొని వదల్లేదు. అప్పుడు శ్రీకృష్ణుడు వచ్చి పామును పాదంతో తన్నాడు. వెంటనే సర్పం సర్పరూపం విడిచి దివ్య గంధర్వరూపం తాల్చింది. హరిచరణం సోకినంతనే సర్పరూపంలో ఉన్న గంధర్వుడు శాపమోక్షం పొంది శుభలక్షణుండై దివ్యప్రభలతో వెలుగొందాడు. అప్పుడు శ్రీహరి వానిని - ఉరగదేహం ఏవిధంగా వచ్చిందని అడిగాడు. గంధర్వుడు తన శాపవృత్తాంతం ఈ విధంగా చెప్పసాగాడు - దేవా! నాపేరు సుదర్శనుడు. నేను గంధర్వుడను. ఒకనాడు విమానారూఢుండనై విహరిస్తున్న సమయాన ఒక ప్రదేశంలో కురూపులైన ఆంగీరస ఋషులు నాకు కనుపించారు. వారిని చూడగానే నాకు నవ్వు వచ్చింది. నవ్వాను. అందుకు వారు కోపించి సర్పరూపం తాల్చమని నన్ను శపించారు. ఆ తరువాత నేను వేడుకొనగా వారు నాకు శాపవిముక్తికి మార్గాన్ని అనుగ్రహించారు. యదుకులంలో జనార్దనుడు ఉదయిస్తాడనీ, ఒక్క దినాన ఆయన పాదతాడనంవల్ల నాకు శాపమోక్షం కలుగుతుందనీ, చెప్పారు. ఇప్పుడు భవదీయ దివ్యపాద స్పర్శచేత నారూపు నాకు మళ్ళీ వచ్చింది - గంధర్వుడిట్లా శాపవృత్తాంతం ఎరిగించి హరిని కీర్తించాడు. ఆ తరువాత గోపకులు దేవతా మహోత్సవం పూర్తికావించుకొని ఇళ్ళకు మరలారు.

## శంఖచూడుని వధ

అటుపిమ్మట ఒకనాటిరాత్రి బలరామకృష్ణు లిద్దరూ ఉజ్జ్వలభూషణ వస్త్రాలంకృతులై, వెన్నెల నిండి పొంగారు

తున్న వనానికి వెళ్లి గోపికలతో కూడి చక్కగా గానం చేస్తూ విహరించారు. ఆ గానమాధుర్యానికి గోపికలు మైమరిచి సొమ్మసిల్లారు. ఆ మైమరపు గాలికి వంటిమీద కేశబంధములు వీడినా వారు ఎరుగరైరి. ఇట్లా సకల భూత సమ్మోహనంగా రామకృష్ణులు రాగాలాపన చేస్తున్న సమయాన కుబేరభటుడైన శంఖచూడుడనే గుహ్యకుడు తన యోగబలంచే కృష్ణాశ్రితలైన ఆ గోపికలను ఎత్తుకొని ఉత్తరదిశకు పరుగు తీయసాగాడు. అప్పుడా గోపికలు రామకృష్ణుల ఎలుగెత్తి పిలచి శరణు వేడారు. అంతట రామకృష్ణులు సాలవృక్షాలు పెల్లగించి గుహ్యకుణ్ణి వెంటాడారు. గుహ్యకుడు ఆ ముద్దరాండ్రను ఒకచోట దించి, భీతుడై పలాయనం చిత్తగించాడు. గోపికలను రక్షింప బలరాముని నియమించి శ్రీకృష్ణుడు గుహ్యకుని వెన్నాడి, పట్టుకొని తన ముష్టితో వాడితలను త్రెంచాడు. ఈ విధంగా శంఖచూడుని వధించి వాడి శిరోరత్నం గ్రహించి కృష్ణుడు మరలి వచ్చి అన్నను గోపికలను కలుసుకొన్నాడు. ఆ దివ్యమణి అన్నకు కానుకగా ఇచ్చాడు.

కృష్ణుడు పగలంతా - ఆలమందల తోలుకొని వనాల విహరిస్తున్నప్పుడు వ్రేపల్లెలోని గొల్లపడుచులు ఆ కృష్ణుని మృదుమధుర వేణుగానం వింటూ, కృష్ణలీలలు పాడుతూ రాత్రి అరుదెంచి తమ్ము సుఖపెడతాడని వియోగభారం భరిస్తూ వచ్చారు.

## వృషభాసుర సంహారం

ఆతరువాత ఒకనాడు భయంకరాకారుడు వృషభాసురు డనే రక్కసుడు హరికి ముప్పు తేదలచి రివ్వు రివ్వున ఉరుకుతూ గోకులానికి వచ్చాడు. వాడి ధాటికి గోగోప గోపీజనమంతా భయభ్రాంతులై పసుగులు తీసి కృష్ణుని శరణుజొచ్చారు. అంతట కృష్ణుడు వారికి ధైర్యం చెప్పి వృషభాసురుడితో తీవ్రంగా తలపడి పోరుసలిపి తెగటార్చాడు. వారి పోరు గగనంనుంచి అవలోకిస్తున్న నిలింపులు గుంపులుగా విరులు వర్షించారు.

## కంసుని కుట్ర

ఇక్కడ ఇట్లా ఉండగా అక్కడ మధురానగరంలో కథ- ఒకనాడు దేవర్షి నారదుడు కంసుడి దర్బారుకు వచ్చాడు. వసుదేవునిపుత్రులైన రామకృష్ణులిద్దరూ వ్రేపల్లెలో సుఖంగా పెరుగుతున్న విషయం చెప్పి పూర్వం కృష్ణజనన సమయాన జరిగిన మోసాన్ని సవిస్తరంగా ఎరుకపరిచాడు. అంతట కంసుడు భగ్గున మండిపడి దేవకీ వసుదేవుల తెగటార్చబోగా నారదుడు వారించాడు. పిదప కంసుడు వారిని ఇనుప సంకెళ్ళతో కట్టి కారాగారంలో పెట్టాడు. పిదప కేశి అనే అసురుని పిలచి రామకృష్ణుల చంపి రమ్మని పంపాడు. తరువాత చాణూర ముష్టిక ప్రముఖులైన తన ఆప్త మంత్రులను సభకు రావించి వారితో మంతనం సాగించాడు. మల్ల యుద్ధంలో ముల్లోక ప్రసిద్ధిగన్న చాణూర ముష్టికులు మల్ల యుద్ధంలో రామకృష్ణుల సంహరించులాగున వారిని హెచ్చరించి, యదు

కుల శ్రేష్ఠుడైన అక్రూరుని రావించి ధనుర్యాగ మిషతో రామ కృష్ణులను మథురకు తోడి తేవలసినదిగా కోరాడు. తాను మథురలో మల్లయుద్ధానికి తగు రంగస్థలం ఏర్పాట్లు కావించి, రంగస్థలా వాకిట కువలయా పీడమనే మదపు టేనుగును నిలిపి రామ కృష్ణుల రాకకై నిరీక్షిస్తున్నాడు.

మహా భక్తుడైన అక్రూరుడు, ఈశ్వరేచ్ఛ తప్పింప శక్యం కాదని కంసునికి నీతిబోధ చేసి, తాను వ్రేపల్లెకు పయనమై వెళ్ళాడు.

## కేశి అనే రాక్షసుని వధ

ఇంతలో కంసుని పంపున కేశి, గుఱ్ఱం రూపంతో, రామ కృష్ణుల వధింప గోకులానికి వచ్చాడు. మహా భయంకరంగా ఉన్న ఆ అశ్వాన్ని చూచి కృష్ణుడు సత్యం గ్రహించాడు. వెంటనే సింహనాదం చేసి ఆ రక్కసుణ్ణి పోరుకి పిలిచాడు. కేశికి, కృష్ణునికి భీషణ సమరం సాగింది. తుదకు తురంగ రూపంలో ఉన్న కేశిని శ్రీహరి సంహరించాడు. దేవతలు సుమవర్షం కురిపించారు.

ఆ తరువాత నారదమహర్షి వచ్చి శ్రీకృష్ణుణ్ణి ఏకాంతంగా దర్శించాడు. వీణ మీటుతూ పలు రీతుల భగవంతుని ప్రస్తుతిస్తూ హరి కీర్తనలు గానం చేశాడు. హరి భక్తుడైన ఆ దేవర్షికి అన్నీ తెలుసును. శ్రీకృష్ణుడు ఇంకా ఏఏ మహా కార్యాలు ఈ పుడమిమీద చేయనున్నాడో అవన్నీ ఉగ్గడిస్తూ కృష్ణలీలలు వర్ణించాడు. పిదప భగవంతుని అనుజ్ఞ వడసి వెడలిపోయాడు.

## వ్యోమాసురుని వధ

ఒకనాడు గోపాలకులు కృష్ణునితో కూడి కొండకోనల్లోన గోవులను మేపుకుంటూ తమలో తాము కొంతసేపు దాగుడు మూతలాట లాడుకొనసాగారు. అప్పుడు మహామాయావి అయిన మయుని కొడుకు వ్యోమాసురుడనేవాడు గొల్ల పిల్ల వాని వేషం ధరించి వచ్చాడు. తానూ ఆటలో కలిసి, చివరకు మోసంచేసి గోపాలకులందరినీ ఎత్తుకొనిపోయి కొండ గుహలో దాచాడు. గుహలో ఎవరూ చూడకుండా ఒక పెద్ద పాషాణం తెచ్చి గుహ వాకిటికి అడ్డు పెట్టాడు. ఈ విధంగా నలుగు రైదుగురు తప్ప తక్కిన గోపకులంతా వాడికి చిక్కి పోయారు. అప్పుడు శ్రీకృష్ణుడు ఆ మాయ రక్కసుని మోసం ఎరిగి వాణ్ణి పట్టుకొన్నాడు. వాడు కొండంత దేహం పెంచి హరిని హతమార్చ చూచాడు కాని, ఆ శ్రీహరి పట్టినట్టు తప్పించుకో లేకపోయాడు. చివరకు శ్రీకృష్ణుడు వానిని వధించి, గుహకు అడ్డుపెట్టిన బండ తొలగించి, గోపాలకుల రక్షించాడు

## అక్రూరుని ఆగమనం

ఇక అక్కడ మధురానగరంలో పరమభాగవతోత్తముడైన అక్రూరుడు కంసుని ఆజ్ఞచొప్పున వేకువ జామున నే రథం ఎక్కి వ్రేపల్లెకు పయనమైనాడు. త్రోవ పొడుగునా ఆ శ్రీహరి నామస్మరణం చేస్తూ, ఆయన లీలలు తలపోస్తూ, దివ్య మంగళ విగ్రహులైన రామకృష్ణులను ఎప్పుడు చూస్తానా అని ఉవ్విళ్ళూరుతూ తుదకు గోకులం చేరుకొన్నాడు.

అక్కడ పలుచోట్ల పద్మనాభుని అడుగుల జాడలు కని, దిగ్గున తేరు దిగ్గి పులకిత గాత్రుడై ఆ అడుగులను కనుల కద్దుకొన్నాడు. ఆ పాద ధూళి శిరమున చల్లుకొన్నాడు. పిమ్మట రామకృష్ణులు బృందావనంలో గోగణం మధ్య ఉన్నారని గోపాలకులవలన విని, తిరిగి రథం తోలుకొని అక్కడికి వెళ్ళాడు. అక్కడ సకల శుభలక్షణ లక్షితులు, జగన్మోహనాకారులు అయిన రామకృష్ణుల కాంచి రయమున రథం దిగి, వారి పాదములపై బడి సాష్టాంగ దండ ప్రణామ ములు ఆచరించా. ఆ మహదానందంలో అక్రూరుని నోట మాట రాలేదు. కన్నుల బాష్పములు రాలాయి. అప్పుడు రామకృష్ణులు, ఆ భక్తుని లేవనెత్తి ప్రేమాదరములతో కౌగ లించుకొన్నారు. పిదప అక్రూరుని చెయ్యి పట్టుకొని తమ గృహానికి తీసుకొని వెళ్ళారు. అక్కడ నందగోపుడు అక్రూ రునికి స్వాగతం ఇచ్చి సకల మర్యాదలు చేశాడు. ఉన్న తాసనంపై కూర్చుండబెట్టి పూజించి, యోగక్షేమాలు విచా రించి, మధురాన్నపానాదు లిచ్చి మార్గాయాసం తీర్చాడు. తరువాత రాత్రి భోజనాలైనపిదప రామకృష్ణులు - సుఖ శయ్యపై పవళించి యున్న అక్రూరుని చెంతకు వచ్చారు - సగౌరవంగా ఆయనను పలకరించి మేనమామ కంసుడు పన్ను తున్న కుట్రలను, కుతంత్రాలను దుష్ట వర్తనను గూర్చి ఉగ్గడించారు. తమవలన తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులకు వాటిల్లిన కష్టములకు ఎంతో విచారించారు. అప్పుడు అక్రూ రుడు కంసుని దురాగతాలు తెలిపి, యాదవులపై ఆతనికిగల వైరానుబంధము, నారదుడు చెప్పిన మాటలు, రామ

కృష్ణులు వసుదేవుని కొమాళ్ళని కంసుడు తెలుసుకొనుట, వారిని మధురా నగరానికి తోడ్కొనిపోవ కంసుని పనుపున తాను దూతగా వచ్చుట, యీ రప్పించుటలో కంసరాజుకు గల కపటోద్దేశ్యము - మొదలైన వృత్తాంతమంతా సవిస్తరంగా ఎరుక పరిచాడు. అందులకు వారు విరునవ్వు నవ్వి - కంసరాజు ఆజ్ఞను తమ తండ్రి అయిన నందగోపునితో చెప్పారు. అంతట నందుడు గోపాలకు లందరినీ రప్పించి వారికీవిషయమంతా చెప్పి మధురానగరం వెళ్ళడానికి ఏర్పాట్లు కావించమన్నాడు. మరునాటిరోజు ఉదయాన్నే రామకృష్ణ సహితులై తామంతా ధనుర్యాగోత్సవం చూడ మధురాపురికి వెళ్ళవలసి ఉన్నదనీ, కంసరాజుకు కానుకలివ్వ సమస్త భారములు ఆయత్తపరచి ప్రయాణ సన్నాహాలు చేయమనీ వ్రేపల్లె వాడ వాడలా చాటింపు చేయించాడు.

ఆ చాటింపు విని వ్రేపల్లెలో గొల్ల పడుచులంతా శ్రీకృష్ణుడు మధురా నగరం వెడుతున్నాడని తెలుసుకొన్నారు. ప్రియుని ఎడబాటుకు మిక్కిలి చింతించారు. శ్రీకృష్ణుని విడిచి ఇక తామెట్లు జీవించగలమని పలువిధాల వాపోయారు. ఆ రాత్రంతా గోపెమ్మలకు కంటిమీద కునుకు లేదు.

అంతలో తెల్లవారింది. స్నానసంధ్యాద్యనుష్ఠానాలు తీర్చుకొన్న పిదప అక్రూరుడు రథం ఆయత్తపరిచాడు. రామకృష్ణుల తోడితెచ్చి రథంలో కూర్చోబెట్టాడు. తాను రథం తోలుతూ తిరిగి మధురానగరం ప్రయాణమైనాడు. నందాది గోపకులంతా కంసరాజుకు కానుకలివ్వ నానావస్తు సంభార

ములు శకటాలపై ఎక్కించుకొని అక్రూరుని రథం వెంట పోసాగారు. ఇట్లా ప్రయాణమై కృష్ణుడు వెడుతుండగా గోపికలంతా రథానికి ఎదురుగా వెళ్ళి కృష్ణునితో మొరపెట్టుకొన్నారు. – నీవు లేకున్న క్షణమొక్క యుగంగా గడుపుతామని, వియోగం సహించలేమని కన్నీరు మున్నీరుగా విలపించారు. కృష్ణుడు వారిని ఓదార్చి తాను త్వరలోనే తిరిగి వస్తానని ధైర్యం చెప్పాడు. పిమ్మట రథం సాగిపోయింది. కనుచూపు దాటిపోవునంతవరకూ గోపికలు కృష్ణుని రథం వెడుతున్న దిశకే చూస్తూ నిలుచుండిపోయారు. తరువాత ఎవరి ఇళ్ళకు వారు వచ్చి కృష్ణలీలలు కీర్తిస్తూ, వియోగభారాన్ని భరిస్తూ కృష్ణుడు తిరిగి వ్రేపల్లెకు ఎప్పుడు వస్తాడా అని కళ్ళలో ఒత్తులు వేసుకొని కనిపెట్టుకొని ఉన్నారు.

అక్రూరుడు రామకృష్ణ సహితుడై వాయువేగంతో రథం తోలుకొని యమునాతీరం చేరుకొన్నాడు. అక్కడ రామకృష్ణులు రథం దిగి యమునానదిలో పాదప్రక్షాళనం చేసుకొని దాహం తీర్చుకొని కొంత తడవు విశ్రాంతి గైకొన్న పిదప తిరిగి రథం ఎక్కారు. రామకృష్ణులు రథంపై కూర్చొన్న పిదప వారి అనుమతి గైకొని అక్రూరుడు యమునానదికి స్నానార్థం వెళ్ళాడు. మడుగులో మునిగి స్నానం చేసి భగవంతునికి అర్ఘ్యంఇస్తున్న సమయాన అక్రూరుడికి ఆ యమునా జలంలో రామకృష్ణులు కనుపించారు. రథంపై ఉన్న రామకృష్ణులు ఇక్కడికి ఎట్లా వచ్చారా అని ఆశ్చర్య చకితుడై అక్రూరుడు వెంటనే మడుగు వెడలివచ్చి రథం దగ్గరికి వెళ్ళి చూచాడు. అక్కడ రామకృష్ణులు యథాప్రకారం

కూర్చొని ఉండడం చూచి మరింత ఆశ్చర్యం పొందినవాడై, రామకృష్ణులు రథంపైననే ఉన్నారు. మడుగులో వాస్తవంగా లేరు కాబోలు - నేనే భ్రమించానేమో, అయినా మళ్ళీ వెళ్ళి చూదాం - అనుకొని తిరిగి మడుగులో దిగి చూడగా, చతుర్భుజాలతోను, శంఖచక్రగదాది ఆయుధాలతోను, శ్రీవత్స లాంఛనంతోను, కౌస్తుభమణితోను, సకల దేవతానీకం కొలుస్తుండగా వైకుంఠంలో లక్ష్మీసమేతుడై శేషపాన్పుపైన పవళించి ఉన్న ఆ శ్రీమన్నారాయణమూర్తి కనుపించాడు. అప్పుడు అక్రూరుడు ఆదినారాయణుడే రామకృష్ణులుగా అవతరించారని గ్రహించి ఆ శ్రీహరిని పలువిధాలుగా వేదమంత్రాలతో ప్రస్తుతించాడు. ఇట్లు ప్రార్థించిన పిదప భగవంతుడు జలంలో తాను చూపిన రూపం ఉపసంహరించాడు. తరువాత అక్రూరుడు నది వెడలివచ్చి తిరిగి రథం అధిరోహించాడు అప్పుడు కృష్ణుడు - అయ్యా! మీరు స్నానానికి వెళ్ళినప్పుడు నీళ్ళలోకాని ఆకాశానకాని ఏదైనా చిత్రం చూచారా? - అని అక్రూరుణ్ణి అడిగాడు. అందుకు ఆయన - అన్ని చిత్రాలకూ మూలమైన నిన్ను చూచే నాకు వేరొక చిత్రం కనుపించదు - అని సమాధానం చెప్పాడు. పిమ్మట వేగంగా రథం తోలడం మొదలుపెట్టాడు. త్రోవలో మధ్య మధ్య జానపదుల గౌరవ మర్యాదలు స్వీకరిస్తూ వారు సుఖంగా ప్రయాణం సాగించారు. అంతలో ప్రొద్దు వాట వాలింది. వారు మధురాపుర ప్రాంతం చేరుకొన్నారు. అప్పటికే నందాది గోపకులు మధురానగరం చేరి ఊరి వెలుపల ఉద్యానవనంలో రామకృష్ణుల రాకకోసం కనిపెట్టుకొని

ఉన్నారు. తరువాత కృష్ణుడు అక్రూరునితో - మీరు ముందుగా వెళ్ళి మారాక తెలియచేయవలసినది. మేము ఈ రాత్రికి ఈ వనంలోనే ఉండి ఉదయానికి వస్తాం - అని చెప్పగా అక్రూరుడు - భక్తపాలనా! నీవు లేకుండా నేనెట్లా నగరంలో ప్రవేశించగలను? ఈ రాత్రికి నీవు బలరామాది సకల పరివారంతో నా గృహానికి వచ్చి నా ఆతిథ్యం స్వీకరించి, నా ఇల్లు పావనం చేయవలసినది. నీ భక్తుడనైన నన్ను అనుగ్రహింపుము - అని ప్రార్థించాడు. అందులకు కృష్ణుడు కంస సంహారం అయ్యేవరకూ ఎవరిగడపలోనూ కాలుపెట్టను. తరువాత మీ కోరిక తీరుస్తాను — అని సమాధానపరిచి అక్రూరుణ్ణి పంపించివేశాడు. అక్రూరుడు కంసరాజు వద్దకు వెళ్ళి తనకు చెప్పిన పని పూర్తిచేశానని విన్నవించి తన గృహం చేరుకొన్నాడు.

## రామకృష్ణుల మధురానగర ప్రవేశం

అంతట సాయంత్రమైంది. ఆ చల్లని వేళ రామకృష్ణులు విలాసార్థం మధురానగర దృశ్యాలు చూడ, గోపాలకులతో బయలుదేరారు. ఇట్లా బయలుదేరి నగరవీధులు తిరిగారు. మనోహరమైన దృశ్యాలు అనేకం తిలకించారు. వీధులలో ఎన్నెన్నో వింతలు చూచారు. జగన్మోహనాకారులైన రామకృష్ణులను కాంచి పురవాసులంతా విస్మయం చెందారు. ఆ భగవత్స్వరూపులను పలురీతుల ప్రస్తుతించారు.

ఇట్లా రామకృష్ణులు పురవీధుల తిరుగుతూ ఒకచోట ఒక చాకలివాణ్ణి చూచి - మాకు చలువచేసిన మంచి వస్త్రాలు

కావాలి, ఇవ్వవలసినది, నీకు మేలు కలుగుతుంది - అని అడిగాడు. కాని ఆ చాకలివాడు కంసరాజుకు బట్టలుతుకేవాడు. ఆ మదం చేత మదించి ఆ యదుపీరుల ఆక్షేపించాడు - ఇవి మహారాజావారి వస్త్రాలు, వీటిని ధరించ మీరు తగరు, వెళ్ళండి - అంటూ తృణీకరించి పలికాడు. వాడి ప్రేలాపనకు అలిగి కృష్ణుడు వాణ్ణి తలమీద ఒక్క తన్ను తన్నాడు. ఆ తాపుకు వాడు నేలకూలి గిలగిల తన్నుకొనుచు ప్రాణాలు విడిచాడు. మూపున ఉన్న గుడ్డలమూట చెల్లాచెదురై క్రింద పడింది. అది చూచి తక్కిన చాకళ్ళు భీతులై బట్టలమూటలు అక్కడే పారేసి పలాయనం చిత్తగించారు. తరువాత రామకృష్ణులు ఆ చలువ వలువలలో తమకు నచ్చిన చక్కని వస్త్రాలు ఏరి తీసుకొని ధరించారు. కొన్ని వలువలు తక్కిన గోపాలకులకు ఇచ్చారు.

పిమ్మట రామకృష్ణులు బయలుదేరి వెడుతుండగా ఒక తంతువాయకుడు కనుపించాడు. వాడా అన్నదమ్ములకు చిత్ర వస్త్రాలు బహూకరించి అలంకారం చేశాడు. కృష్ణుడు వాడికి సకల ఐశ్వర్యాలు ప్రసాదించి అనుగ్రహించాడు. తరువాత వారు సుదాముడనే మాలాకారుని గృహానికి వెళ్ళాడు. మాలాకారుడు రామకృష్ణులకు సాగిలపడి మ్రొక్కి, ఉన్నతాసనంపై కూర్చుండచేసి అర్ఘ్యపాద్యాదులొసగి భక్తితో పూజించాడు. పూలమాలలు సమర్పించి పలువిధముల ప్రస్తుతించాడు. అతని భక్తికి మెచ్చి అచ్యుతుడు సకల సిరిసంపదలు ప్రసాదించి, భాగవతోత్తముడగునట్లు అనుగ్రహించాడు.

ఆ తరువాత రామకృష్ణులు తిరిగి పయనమై నగరంలో ఇంకా ముందుకు సాగిపోయినారు.

## కుబ్జ అను దాసికి సౌందర్య ప్రసాదం

రాజమార్గాన పరిమళ ద్రవ్యాలైన లేపనములతో నిండిన పాత్రలు తీసుకొని నడుస్తున్న కుబ్జ అయిన ఒక దాసీది వారి కంట పడింది. హరి ఆ జవ్వనిని పలకరించి నీ వెవ్వరవు? ఈ లేపనాలు ఎవరికోసం?—అని అడిగాడు. తన పేరు త్రివక్ర అనీ, కంసరాజుకోసమై పూతలు తీసుకెడుతున్నాననీ ఆమె చెప్పింది. ఇట్లా చెప్పి ఆ దాసీది జగన్మోహనా కారుడైన కృష్ణుని సౌందర్యం చూచి మోహించింది. ఆ లేపనాలన్నీ రామకృష్ణుల వంటికి పూసి సుఖం చేకూర్చింది. అప్పుడు హరి ఆమెను కరుణించి కురూపం పోగొట్ట దలచాడు. దాని మునిగాళ్ళు తన పాదాలతో త్రొక్కాడు. దానిని గడ్డం పట్టుకొని లేవనెత్తాడు. ఆ పావనమూర్తి కరస్పర్శవలన కుబ్జకు కురూపం పోయి చక్కని చుక్క అయి నిలుచున్నది. అంతట ఆ సుందరాంగి కృష్ణుని పోనివ్వక, ఉత్తరీయంతో కట్టి పట్టుకొని సుందరాంగా! నా ఇంటికి వచ్చేసి నన్ను సుఖపెట్టుమని వేడింది. అందులకు కృష్ణుడు మందహాసంచేసి, — వచ్చినకార్యం చక్కబెట్టుకొన్న పిదప నీ ఇంటికి వస్తాను—అని మాట ఇచ్చి దాన్ని పంపించివేశాడు. ఈ విధంగా రామకృష్ణులు పలువురు పుర వాసులచే వివిధ కానుకలు గైకొంటూ సాగిపోయారు. ఆ రమాకాంతునిచూచి పౌరకాంతలంతా ముంచుకొచ్చిన మోహంలో మునిగిపోయారు. పోయి పోయి రామకృష్ణులు

కంసుడు ధనుర్యాగం చేస్తున్న ప్రదేశానికి చేరుకొన్నారు. యాగశాలలో అద్భుతంగా ఉన్న ఒక కోదండాన్ని ఎక్కుపెట్టి కృష్ణుడు, కావలివాళ్లు వద్దన్ననూ వినక దాన్ని ఫెళ్ళున విరిచాడు. ఆ ధ్వనికి భూమ్యాకాశాలు అదిరాయి. కంసుని గుండెలు బెదిరాయి. అంతట కావలిభటులంతా కలిసి రామకృష్ణులను ఎదిరించారు. రామకృష్ణులు వారందరినీ, కంసుడు పంపిన సేనా సమూహాన్ని యుద్ధంలో తెగటార్చి యాగశాలలో యథేచ్ఛగా విహరించారు. పురజనులంతా ఆ మహావీరుల ప్రశంసించారు. ఆ తరువాత రామకృష్ణులు నగరం వెలుపల ఉద్యానవనంలో ఉన్న తమ విడిదికి మగిడివచ్చి కరచరణాదులు కడిగికొని పాయసం భక్షించి సుఖంగా నిద్రించారు.

ఇక — అక్కడ కంసుడు కావలివారివలన రామకృష్ణుల వీరకృత్యాలు విని విహ్వలచిత్తుడై నాడు. ఆ రాత్రంతా అతని కంటిమీద నిద్ర లేదు. కన్నుమూస్తే పీడకలలు వస్తున్నాయి. తన చావు సమీపించినట్లు అనేక అపశకునాలు పొడసూపుతున్నాయి. తరువాత తెల్లవారింది. కంసుని పనుపున మల్లయుద్ధానికి తగిన సన్నాహాలన్నీ పూర్తిఅయినాయి. మల్లయుద్ధం చూడ రాజాధిరాజులంతా వచ్చి ఆసనాలు అలంకరించారు. పురవాసులు జానపదులు ఎత్తైన గోడలు, మంచెలు ఎక్కారు. భేరీ మృదంగాది వాయిద్యాలు మ్రోగాయి. పతాకలు ఎగిరాయి. కంసరాజు మంత్రి సామంత పరిజన సహితుడై సింహాసనమున కూర్చొన్నాడు. చాణూరుడు, ముష్టికుడు మొదలైన మల్లవీరులంతా రంగ

స్థలానికి చనుదెంచారు. నందాది గోపకులు తాము తెచ్చిన కానుకలు కంసునికి సమర్పించి ఒక ఎత్తు మంచెపై ఆసీనులైనారు. వాయిద్యాలు, మల్లధ్వనులు విని రామకృష్ణులు యుద్ధరంగ స్థలానికి వేంచేశారు. ద్వారంలో కువలయాపీడం అనే మదపుటేనుగు వారిని అడ్డగించింది. మావటివాడు ఆ మదపుటేనుగును రామకృష్ణులపై పురికొల్పగా అది కొండలు పగిలేటట్లు ఘీంకరిస్తూ వారిపై పడింది. అంతట మహావీరుడైన శ్రీకృష్ణుడు బాలుడయ్యీ దానితో ఘోరంగా తలపడ్డాడు. ఒకమారు దాని తొండాన్ని, మరొకమారు తోకను పట్టుకొని దానికి అందీ అందనట్లు కవ్విస్తూ చాలాసేపు బంతి ఆట ఆడాడు. చివరకది తీవ్రమైన రోషంతో చంపరాగా కృష్ణుడు దాని తొండం పట్టుకొని గిర గిర త్రిప్పి నేలమీద పడవేశాడు. సింహంలా లంఘించి దాని దంతాలు ఊడబెరికి చంపివేశాడు. తనపై కలియవచ్చిన మావటివాండ్రను, తక్కిన బలగాన్ని మట్టుపెట్టి, విజయుడై బాలసూర్యునివలె ప్రకాశిస్తూ మల్ల యుద్ధరంగ స్థలంలో ప్రవేశించాడు. దివ్యమంగళ విగ్రహులైన రామకృష్ణులను చూచి పురవాసులు, జానపదులు ఆశ్చర్య చకితులై పలు విధాల ప్రశంసించారు.

## చాణూర ముష్టికుల వధ

భేరీమృదంగాలు మ్రోగుతుండగా చాణూర ముష్టికులు అనే మల్లవీరులు, భుజాలు అప్పళిస్తూ రామకృష్ణులను మల్ల యుద్ధానికి పిలిచారు. రాముడు ముష్టికునితోను, కృష్ణుడు

చాణూరునితోను పోరుసలుప పూనుకొన్నారు. ఆ వీరులు ఇట్లా మల్లయుద్ధానికి సన్నద్ధులై ఉండగా, సమస్త జనులూ ఆశ్చర్య చకితులవడమే కాక, ఆందోళనతో ఊగిపోయారు. కొండలలా కనుపిస్తున్న చాణూర ముష్టికులెక్కడ, ముక్కు పచ్చలారని కుర్రవాళ్ళు — రామకృష్ణులెక్కడ? రామ కృష్ణులకు అపకారంచేసే తలంపుతో కంసరాజు ఈ మహోపాయం పన్నాడు. ఇది న్యాయ యుద్ధంకాదు — అంటూ సమస్త జనులూ కంసరాజు దుర్నీతిని గర్హించారు. అంతలో మల్లయుద్ధం మొదలైంది. కృష్ణుడు చాణూరునితోను, రాముడు ముష్టికునితోను బాహాబాహీ, ముష్టాముష్టి పోరు సలిపారు. సింహం సింహంతో తలపడినట్లు, ఏనుగు ఏనుగుతో ఢీకొన్నట్లు వారు చిత్ర విచిత్రమైన రీతుల మల్లయుద్ధ ప్రావీణ్యాన్ని ప్రదర్శిస్తూ ఒకరి కొకరు తీసిపోక చాలాసేపు పోరాడారు. తుదకు రామకృష్ణులు ఇక జాగుచేయరాదని తలచి, వీర్యప్రతాపాలు పెంచి చాణూర ముష్టికుల చావ మోదారు. అంతట తక్కిన మల్లులంతా భయవిచలితులై పలాయనం చిత్తగించారు. సమస్త జనులు రామకృష్ణుల శౌర్యప్రతాపాలు కీర్తిస్తూ జయజయ ధ్వానాలు చేశారు. ఒక్క కంసుడికి మాత్రం ముఖాన నెత్తురుచుక్కలేదు. తన పన్నాగం ఫలించనందుకు విచారించి. కళవళపడి, కోపం తెచ్చుకొని గోపాలక సహితులై రంగస్థలాన విలాస నృత్యం చేస్తున్న రామకృష్ణులను వెంటనే నగరంనుంచి వెళ్ళగొట్టండని తన సేనాపతుల ఆజ్ఞాపించాడు. యాదవుల ధనం కొల్ల గొట్టమనీ, నందగోపుని బంధించమనీ యాదవ పక్షపాతి

అయినా తన తండ్రి ఉగ్రసేనుణ్ణి చంపమని కఠినంగా ఉత్తర్వు ఇచ్చాడు.

## కంసవధ

కంసకావరంతో కంసుడు ప్రేలుతుంటగా ఇక సహించ రాదని శ్రీకృష్ణుడు కోపోద్దీపితమానసుడై మదపుటేనుగుపై లంఘించు సింహపుపిల్ల వలెది కంసుడు కూర్చున్న సింహాసనం పైకి లంఘించాడు. మృత్యువులా తనపైకి వస్తున్న అచ్యుతుణ్ణి చూచి కంసుడు తటాలున కత్తి, డాలు ఎత్తి పోరుకు తలపడ్డాడు. గరుత్మంతుడు పాదాలతో పామువడగను త్రొక్కినట్లు, కృష్ణుడు కంసకిరీటాన్ని పడతన్నాడు. కుప్పించి ఎగసి మేనమామ జుట్టుపట్టి సింహాసనంనుండి ఈడ్చి మేదినిపై పడవైచి గుండెలపై ఎగిరి కూర్చున్నాడు గోపాలకృష్ణుడు. ముష్టిఘాతలతో కంసుని ఒడలంతా గుల్లచేసి, సంహరించాడు. కంసుడు పీనుగై పడుటకాంచి జనులంతా హాహాకారాలు చేశారు. ఈ విధంగా అహర్నిశలూ హరిని ద్వేషించి, హరి చేతుల్లో మరణించిన కంసుడు ఈశ్వరసాయుజ్యం పొందాడు. ఆ తరువాత కంసుని చావు విని అతని తమ్ములు కంకన్యగ్రోధకాదులు ఎనిమిదిమంది కోపోద్దీపితులై పైపడరాగా బలరాముడు వారందరినీ పరిమార్చాడు. అప్పుడు మింట దేవదుందుభులు మోరశాయి. బ్రహ్మేంద్రాది దేవతలు రామకృష్ణులపై పూలవానలు కురిపించి ప్రశంసించారు. అప్సరసలు ఆడారు. తరువాత కంసుని భార్యలు, కంసుని తమ్ముని భార్యలు వచ్చి తమ భర్తలపైబడి గోడుగోడున దుఃఖించ

సాగారు. అప్పుడు కృష్ణుడు వారందరినీ ఓదార్చి, మేనమామలకు విధి పూర్వకంగా దహనసంస్కారాది క్రియలు నెరవేర్చి వారిని ఇళ్ళకు పంపించాడు.

అటుపిమ్మట రామకృష్ణులు తల్లిదండ్రులైన దేవకీవసుదేవులను దర్శించి సాష్టాంగ ప్రణామము లాచరించారు. ఆ దంపతులు కొమార్ళను చూచి కొండంత సంతోషంతో లేవనెత్తి కౌగలించుకొని తొడలపై కూర్చోబెట్టుకొన్నారు. రామకృష్ణులు వారిని బంధవిముక్తుల కావించి ఊరడించారు. ఇంతకాలం తమకు తల్లిదండ్రుల సేవచేసే భాగ్యం కలుగనందుకు విచారించారు. ఆ తరువాత తాతగారైన ఉగ్రసేన మహారాజును రప్పించి తిరిగి ఆయనకు రాజ్యభారం అప్పగించారు. కంసునిచే పీడింపబడిన దేశదేశాల రాజులను రావించి వారికి పూర్వపదవులనిచ్చి గౌరవించారు. యాదవులందరికీ మోదం చేకూర్చారు. పిమ్మట గోకులపతి అయిన నందుని చెంతకు వెళ్ళి ఆయన్ను కౌగలించుకొని – తండ్రీ ! మీరు, యశోదాదేవి మమ్ములను ఇంతకాలం ప్రేమతో పెంచి పెద్దచేశారు. మాతాపితృ ఋణం ఎన్నటికీ తీర్చుకోజాలం. ఇక ఇప్పుడు మీరు వ్రేపల్లెకు వెళ్ళండి. మేమిక్కడ కొంతకాలం ఉండి, దేవకీవసుదేవులకును సంతుష్టాంతరంగుల చేసి తిరిగి మీవద్దకు వస్తాము – అని చెప్పి ఆయనకు ధనకనక వస్తువాహనాదులిచ్చి సత్కరించారు. నందుడు రామకృష్ణుల కౌగలించుకొని కన్నీరు నించుచూ వారిని విడువలేక విడువలేక విడిచి గోపాలకులతో మళ్ళీ వ్రేపల్లెకు వెళ్ళిపోయాడు.

## రామ కృష్ణుల విద్యాభ్యాసం

ఆ తరువాత వసుదేవుడు సకల బంధువులను, బ్రాహ్మణోత్తములను రావించి రామకృష్ణులకు శాస్త్రోక్తవిధానంగా ఉపనయన సంస్కారం కావించాడు. ద్విజశ్రేష్ఠుడైన గర్గాచార్యులవారు వారికి గాయత్రి ఉపదేశించాడు. అటు పిమ్మట రామ కృష్ణులు బ్రహ్మచర్యం అవలంబించి, తల్లిదండ్రుల అనుజ్ఞ వడసి, విద్య నభ్యసించేటందుకు కాశీపట్నం వెళ్లారు. అక్కడ అవంతీ పురవాసి అయిన సాందీపనుడనే విద్వాంసుని దర్శించి ఆయనవద్ద విద్య నేర్చుకోవడం మొదలుపెట్టారు. క్రమబద్ధంగా గురుకులవాసం చేసి రామకృష్ణులు అచిర కాలంలోనే సకల విద్యలూ అభ్యసించారు. వారి వినయ విధేయతలకు మెచ్చుకొని ఆచార్యులవారు వారికి అన్ని విద్యలూ నేర్పాడు. మహానుభావులైన రామ కృష్ణులు రోజుకొక విద్యచొప్పున అరవైనాల్గు రోజులలో - వేదాలు, వేదాంగములు, వేదాంతాలు, ధర్మశాస్త్రాలు, ధనుర్వేద రహస్యాలు మొదలైన అరవైనాలుగు విద్యలూ నేర్చారు. రాజనీతి సంపూర్ణంగా అభ్యసించారు. ఈ విధంగా విద్యాభ్యాసం పూర్తి చేసిన పిదప వారు, గురుదక్షిణ ఏం కావాలో తెలుపవలసినదని గురువర్యులను వేడుకొన్నారు. అప్పుడు సాందీపనుడు తన భార్యతో ఆలోచించి పూర్వం, చాలా కాలం క్రిందట ప్రభాసతీర్థంలో సముద్రాన స్నానమాడుతూ చనిపోయిన తమ కుమారుణ్ణి తిరిగి తెచ్చి ఇవ్వవలసినదని కోరాడు. అందుకు సమ్మతించి రామకృష్ణులు తక్షణం రథంపై ఎక్కి ప్రభాస క్షేత్రానికి వెళ్ళారు. సముద్రతీరానికి

చేసుకోగానే సముద్రుడు వారు భగవత్స్వరూపులుగా ఎరింగి వెంటనే సకలపూజా ద్రవ్యాలతో పైకి వచ్చాడు. అప్పుడు రామ కృష్ణులు తాము వచ్చిన పని చెప్పి గురుపుత్రుణ్ణి తక్షణం తెచ్చి ఇమ్మని అడిగారు. అందుకు సాగరుడు సవినయంగా చేతులు జోడించి – మహాత్మా! మీ గురు పుత్రుణ్ణి నేను అపహరించలేదు. నా జలగర్భంలో శంఖ రూపధారి అయిన పంచజనుడనే రాక్షసు డొకడున్నాడు. వాడు మీ గురుపుత్రుని అపహరించాడు. – కనుక మీరు జలంలో ప్రవేశించి వాణ్ణి సంహరించి మీ గురుపుత్రుని తెచ్చుకోండి – అని ప్రార్థించాడు. అంతట రామ కృష్ణులు సముద్ర గర్భంలో ప్రవేశించారు. లోపల ఉన్న దానవుణ్ణి వెదికి వధించారు. వాడి పొట్ట చీల్చి చూడగా అందు గురు పుత్రుడు కనుపించలేదు అందువలన గురుపుత్రుడు యమ లోకంలో ఉండి ఉంటాడని నిశ్చయించుకొని, ఆ పంచజనుడి శరీరాన పుట్టిన 'పాంచజన్య' అనే శ్రేష్ఠమైన శంఖాన్ని గ్రహించారు. పిదప అక్కడనుండి యమలోకం వెళ్ళి పాంచ జన్యం పూరించారు. ఆ శంఖనాదం వినగానే యమధర్మరాజు ఎదురువచ్చి భక్తి పురస్సరంగా రామ కృష్ణులకు పూజ సలిపి వచ్చినకార్యం తెలుపుమని వేడుకొన్నాడు. వారు తమ గురుపుత్రుని విషయం చెప్పి వెంటనే తెచ్చి అప్పగించమని ఆజ్ఞాపించారు. తక్షణమే యమధర్మరాజు సాందీపనుని కుమారుణ్ణి తెచ్చి రామకృష్ణుల కర్పించాడు. తరువాత వారు గురుపుత్రుని తీసుకొనివచ్చి ఆచార్యులవారికి సమర్పించారు. సాందీపనుడు ఎంతో సంతోషించి జగత్పావనులైన ఆ పుణ్యా

పురుషులు తనకు శిష్యులైనందుకు ధన్యత చెందానని తలచాడు. అనంతరం రామకృష్ణులు అయ్యవార్ల వద్ద సెలవు తీసుకొని మధురానగరం విచ్చేశారు. వారి రాకకు మధురాపుర వాసులు మహదానంద భరితులైనారు.

ఆ తరువాత ఒకనాడు శ్రీకృష్ణుడు తన భక్తుడు, బుద్ధికుశలుడు అయిన ఉద్ధవుణ్ణి రావించి, వ్రేపల్లెకు వెళ్ళి అక్కడ నందాది గోపకుల, గోపకాంతల క్షేమం అడిగి రమ్మని పంపించాడు. వెంటనే దేవాజ్ఞను ఔదలదాల్చి ఉద్ధవుడు రథారూఢుడై వ్రేపల్లెకు వెళ్లాడు. అక్కడ నందాది గోపకులు ఉద్ధవునికి సకల మర్యాదలతో స్వాగతం ఇచ్చి, పూజించి రామకృష్ణుల క్షేమసమాచారం అడిగారు. అందరూ కుశలమనీ, వారు పంపగా తాను వచ్చాననీ వృత్తాంతమంతా వివరంగా చెప్పాడు ఉద్ధవుడు. అచిరకాలంలో రామకృష్ణులు వ్రేపల్లెకు అరుదెంచి యాదవులందరికీ మోదం చేకూర్చనున్నారని ఎరిగించాడు. అనంతరం ఉద్ధవుని రాక కని గోపకాంతలంతా ఆయనను కృష్ణుని దూతగా ఎరిగి, అక్కడికి వచ్చారు. కృష్ణవియోగం తమకెంత దుర్భరంగా ఉన్నదీ ఉద్ధవునితో ఎన్నోవిధాల చెప్పుకొని విలపించారు గోపెమ్మలు. తరువాత బాలగోపాలుని లీలావిలాసాలు తలుచుకొంటూ గోపకాంతలు ఉద్ధవుని ఎదుట సిగ్గువిడచి పలువిధాల పలవరించారు. ఝుమ్మని తిరుగుతున్న ఒక తుమ్మెదను కాంచి ఆ గొల్లపడుచులు – తమ ప్రియుడు పంపిన దూతగా ఆ తుమ్మెదను పోల్చి దానితో తమ విరహవేదన వెళ్ళబోసుకొన్నారు– తుమ్మెదా, ఓ తుమ్మెదా! నీవు తుంటరిదానవు – దూతగా

వచ్చి నీ యజమానుని కీర్తి మాముందు పాడుతున్నావే. ఆయన వచ్చిమోసగాడుసుమా – అంటూ ఆ గోపికలు పలు తీరుల భ్రమరగీతాలు పాడారు. అంతట ఉద్ధవుడు వారి వేదన విని ఓదారుస్తూ, కృష్ణుడు మిమ్ముల అనుగ్రహిస్తాడని చెప్పాడు — నేను ఎల్లప్పుడూ మీ మనస్సుల్లో మెదులు తుంటాను. కాన నా వియోగబాధ మీకు ఉండదు – అని కృష్ణుడు పంపిన సందేశం గోపికలకు అందించాడు ఉద్ధవుడు. అంతట గోపికల మనోవేదన కొంత చల్లారింది. మధురా పురిలో కృష్ణుని కుశలాన్ని గూర్చి గుచ్చి గుచ్చి అడిగారు. – మేం పల్లెలలో ఉండే గొల్లపడుచులం. ఇప్పుడు కృష్ణుడు మమ్ముల మరిచిపోయి పట్నవాసపు స్త్రీలను మరిగాడా? – ఇంక మేం ఆయనకు జ్ఞాపకం ఉంటామా! అసలు ఎప్పుడైనా మా మాట అనుకుంటాడా? – అంటూ పలు తెఱంగుల ఆ గోపకాంతలు కృష్ణుణ్ణి వేడుకొని వియోగవేదన చల్లార్చు కొన్నారు. ఉద్ధవుడు గోకులంలో గోపాలుని కీర్తిస్తూ కొన్ని నెలలు ఉండి గోపకాంతలకు సంతోషం కలిగించాడు. ఆయన ఉన్నన్నాళ్ళూ గొల్లపడుచులు రోజులు క్షణాల్లా గడిపి వేశారు. తరువాత ఆయన వ్రేపల్లెవాసులవద్ద సెలవు తీసు కొని తిరిగి మధురకు బయలుదేరాడు. నందాది గోపకులంతా, ఆయనకు అనేక కానుకలిచ్చి కృష్ణుణ్ణి వేగిరం రమ్మని చెప్ప వలసినదిగా వేడుకొన్నారు. ఉద్ధవుడు మధుర చేరేడు. కృష్ణుణ్ణి దర్శించాడు. వ్రేపల్లెవాసులంతా కృష్ణా, కృష్ణా అని కలవరిస్తున్నారని వారి భక్త్యావేశాల విషయం వివరంగా విన్న వించాడు. వారొసగిన కానుకలు కృష్ణునికి సమర్పించాడు.

ఆ తరువాత శ్రీకృష్ణుడు పూర్వం ఇచ్చిన మాట ప్రకారం కుబ్జ అనే దాసీదాన్ని అనుగ్రహించి దాని ఇంటికి ఉద్ధవసహితుడై వెళ్ళాడు. కుబ్జ, చెలులతో ఎదురువచ్చి కృష్ణుడికి స్వాగతం ఇచ్చి ఉన్నతాసనమున కూర్చుండబెట్టి పూజలొనర్చింది. తరువాత కొత్తపాన్పు వేసి కృష్ణుణ్ణి పాన్పుమీదికి పిలిచింది. తాను తలంటి జలకమాడి, కొప్పులో పువ్వులుపెట్టి, వలిపెంపు చీరకట్టి, ఆభరణాలు ధరించి, పరిమళ ద్రవ్యాలు పూసి, తాంబూలచర్వణంచేసి పడకగదికి వచ్చింది. గర్భాదానపు పెళ్ళికూతురువలె సిగ్గు అభినయించింది. శ్రీకృష్ణుడా చక్కని చిన్నదాన్ని పక్కన చేర్చుకొని రతిక్రీడలు తేలియాడాడు. కుబ్జను సుఖపెట్టాడు కృష్ణుడు. కృష్ణుణ్ణి సుఖపెట్టింది కుబ్జ. తనివితీరక అట్లాగే కొన్నాళ్ళుండి రమించమని కృష్ణుణ్ణి కోరింది. కృష్ణుడు ఆమె మోహం తీర్చాడు.

ఆ తరువాత బలరాముని, ఉద్ధవుని వెంట నిడుకొని అక్రూరుని మందిరానికి వెళ్ళాడు. అక్రూరుడు భగవంతుని భక్తితో పూజించి ఆతిథ్యం ఇచ్చాడు. పలురీతుల ప్రస్తుతించాడు. పిదప కృష్ణుడు ప్రియవాక్కులతో అక్రూరుని ఆనందపరచి – అయ్యా! నీవు మా శ్రేయస్కారకుడవు. ఒకమాటు హస్తినాపురం వెళ్ళి పాండవుల క్షేమం అరసిరావలసినది. తండ్రి చనిపోయిన తరువాత ఆ పసివాళ్ళు ధృతరాష్ట్రుని ఆశ్రయించి ఉన్నారు. కుమాళ్ళ చెప్పు చేతలలో ఉండి ఆయన పాండవులను సరిగ్గా చూడడం లేదట. కనుక ఎట్లా ఉన్నారో కనుక్కొని రాకోరుతున్నాను – అని పలికాడు. అందుకు అక్రూరుడు సంతోషంతో సమ్మతించి హస్తినాపురికి ప్రయాణం కట్టాడు.

## అక్రూరుని హస్తినాపుర ప్రయాణం

అక్రూరుడు హస్తినాపురం చేరి ధృతరాష్ట్రుడు, భీష్ముడు, విదురుడు, బాహ్లీకుడు, సోమదత్తుడు, ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ, కర్ణుడు, దుర్యోధనుడు మొదలైనవా రందరినీ కలుసుకొన్నాడు. పాండవులను, కుంతీదేవిని దర్శించాడు: ఉచితరీతి అందరినీ కుశలప్రశ్న లడిగి తెలుసుకొన్నాడు. కొన్ని మాసా లక్కడే ఉండి పరిస్థితులన్నీ అవగతం చేసుకొన్నాడు. పాండవుల అస్త్రశస్త్రాది నైపుణ్యం, ప్రజానురంజకమైన వినయాది సద్గుణ సంపత్తి చూచి ఓర్వలేక ధార్తరాష్ట్రులు వారికి విషం పెట్టి చంపాలని ప్రయత్నించడం ఆదిగా గల వృత్తాంతం అంతా కుంతీదేవివలన, విదురునివలన తెలుసుకొన్నాడు. తరువాత కుంతీదేవి తన పుట్టింటి విషయాలు తలుచుకొంటూ అక్రూరుని చెంతకు వెళ్ళి కంట తడి పెట్టింది. అయ్యా! మాపుట్టింటి బలగమంతా బాగున్నారా? మావాళ్ళంతా ఎప్పుడైనా మమ్ముల తలుచుకుంటున్నారా? మా అన్న కొడుకులు కృష్ణుడు, రాముడు ఎన్నడైనా తమ మేనత్త కుమాళ్ళయిన పాండవులమాట తలుచుకుంటున్నారా? నా బిడ్డలు తండ్రిలేని బిడ్డలు. పసివాళ్ళు. మేమంతా ఇక్కడ పులులమధ్య చిక్కిన మేకపిల్లలవలె, పగవాళ్ళమధ్య చిక్కుకొన్నాం. ఇక నాకు ఆ శ్రీకృష్ణుడే శరణ్యం. నేను ఆ భగవంతుణ్ణే నమ్ముకొన్నాను - అని పలువిధాల దుఃఖించి తన బాధంతా వెళ్ళబోసుకొన్నది.

ఓ పరీక్షిన్మహారాజా! శ్రద్ధగా వినవలసినది. మీ పితామహి అయిన కుంతీదేవి ఇట్లా దుఃఖించగా అక్కడున్న అక్రూరుడు, విదురుడు చూడలేకపోయారు. పాండవులు దేవతా సంభూతులని, వారి జన్మవృత్తాంతం ఆ మెగారికిఎరుకపరిచి ఓదార్చాడం. ఆ తరువాత అక్రూరుడు ధృతరాష్ట్రుని సభా మంటపానికి వెళ్ళి – రాజ్యభోగాలు శాశ్వతం కాదు. ధర్మం తప్పినవాడికి పుట్టగతులుండవు కావున ధర్మం తప్పక నీ తమ్ముని పుత్రులైన పాండవులను, నీ పుత్రులైన కౌరవులను సమానంగా చూచుకోవలసినది,–లేనిచో ఇహానికీ పరానికీ చెడతావు – అని అందరూ వింటుండగా నీతి బోధ చేశాడు. అందుకు ధృతరాష్ట్రుడు – అయ్యా! నీవు చెప్పే మాటలు అమృత గుటికలు. నాకు తెలుసును. కాని పుత్ర ప్రేమలో చిక్కుకొన్న నా పాడు మనస్సు ఎంత చెప్పినా వినకున్నది. శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవంతుడు. ఆయన విధి నెవ్వరూ తప్పింపలేరు– జగదీశ్వరునకు నమస్కరిస్తున్నాను– అని బదులు పలికాడు. అనంతరం అక్రూరుడు కౌరవులవద్ద, పాండవులవద్ద సెలవు తీసుకొని తిరిగి మధురానగరం చేరుకొన్నాడు. హస్తినాపురంలో పాండవుల పరిస్థితి, ధృతరాష్ట్రుడు అనుసరిస్తున్న నీతి – అంతా సవిస్తరంగా రామకృష్ణులకు ఎరుకపరిచాడు.

ఆంధ్ర వచన భాగవతంలో

దశమ స్కంధం

పూర్వ భాగం

సమాప్తం.